# భారతి

సాహిత్య మాసపత్రిక




సెప్టెంబరు 1989

వెల : 5 రూపాయలు



- పద్మావతీ చరణ చారణ చక్రవర్తి : "త్రి"
- గాలిబ్ ప్రణయ కవితా తత్త్వం : బుద్ధన్న
- ఏఋవ భీమ - మైలమభీమ : కృష్ణమూర్తి
- ఇంతా చేసి ఏం చూసింది నేల? : సాంధ్యశ్రీ

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(19[illegible]-197[illegible])

సంపుటము : 66 | సెప్టెంబరు 1989 | సంచిక : 10

విడి ప్రతి వెల ఆరు రూపాయలు

## విషయానుక్రమణిక

# స్వవిషయం

ఉర్దూకవి గాలిబ్ తన ఆత్మవృత్తంలో అల్లుకున్న అనిర్వచనీయమైన రాగాత్మక వేదనామయ విశిష్ట ప్రపంచాన్ని తడిమి ముద్దుల మురిపాయిరా లాంటి అతని మనసుల్లోంచి పొంగుకొచ్చిన ప్రణయ కవితా తత్త్వాన్ని గురించి డా॥ బుద్ధన్న వివరించిన తీరు హృదయంగమంగా ఉంది. ఈ తత్వంలో ఎవరికయినా జలతారు సీమలు, గుల్మొహర్లు, నిషా నిలయాలు, మోహన సాకీలు, మధుర మధనాలు, జ్వాలా వలయాలూ కనిపిస్తాయి.

ప్రాచీన భారతంలోని గ్రామీణ న్యాయ పంచాయతీల గురించి శ్రీ ముత్తయ్య ఈ నెల భారతిలో ఒక వ్యాసం రాసారు. గ్రామీణులకు ఉదాత్తమైన జీవనాన్ని అందించడం కోసం గ్రామ పంచాయతీలు కృషి చేయాలని – గ్రామసీమలు స్వర్గసీమలు కావాలని – కలలుగన్న బాపూజీ ఆశయాల గురించి ఇక్కడ తప్పక నెనపుకు తెచ్చుకోవాలి.

ఈ నెల కన్నడ కథానిక తెలుగు రూపం "బతికే వున్నారు" మానవ జీవితంలోని ఒక కోణాన్ని ప్రతిబింబించే ఈ కథా యితివృత్తం ఎవరినైనా కుదిపివేయగలదు. ఒక్క వాస్తవానికి మాత్రమే అట్టి శక్తి ఉంది.

విజయనగర సామ్రాజ్యలక్ష్మి ఎంతకాలం జీవించి ఉండిందని కీ.శే. కోదండరామయ్యగారు ఈ నెల భారతిలో చర్చిస్తున్నారు. ఈయన వాదంతో ఎంతమంది చరిత్రకారులు ఏకీభవిస్తారో అన్న విషయం ఇంకా తేలవలసి ఉంది.

ఈ నెల భారతిలో అందిస్తున్న "పద్మావతీ చరణ చారణ చక్రవర్తి" నాటిక పన్నెండవ శతాబ్దికి చెందిన జయదేవుసికి, పద్మావతికి సంబంధించినది. "భారతీ" సుగతులకు చిరపరచితుడైన శాస్త్ర సాహిత్య సవ్యసాచి "తి"గారి రసరమ్య సృష్టి ఈ నాటిక. లోకోత్తరమైన—

"వాగ్దేవతా చరిత చిత్రిత చిత్త సద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తి"–

అనే అక్షర నిధికి ప్రత్యక్షర నిధి ఈ భావ సుధా జలనిధి అని అనవచ్చునేమో కూడా!




ఈ నెల భారతిలో ఇలాంటివి మరెన్నో!

కవిత్వపు గుబాళింపులు సరేసరి.

# నన్నిలా...

శ్రీ భువనగిరి నాగరాజు

మమత, మానవత్వం మరుగై
ద్వేషం, మోసం నాగులై తిరిగే
ఈ అరణ్యంలో—
కురుస్తున్న అవినీతి దుర్గంధంలో
నిలువునా తడుస్తున్న వాణ్ణి—
నన్నిలా తడవనీయండి!
వీస్తున్న విషపుగాలిని పీల్చుకొని
ఈ ఎడారుల్లో
అమృతధారనై కురవాలనుకొనేవాణ్ణి—
ఇలా పీల్చనివ్వండి!
మింటిని రగిలే సూర్యుణ్ణి
పానీయంలా త్రాగి
ఈ చీకటి నరకంలోనికి
వెన్నెల వాగునై వరుగు తీయాలనుకొనేవాణ్ణి—
నన్నిలా నడచిపోనివ్వండి!
గుండెల్లో—
పొగలు కక్కుతున్న జ్వాలాముఖుల్ని
కన్నుల్లో—
ఎగసి పడుతున్న లావాల కెరటాల్ని
మోస్తూ తిరుగుతున్న మానవుణ్ణి
ఈ కీలల్లో మునగనివ్వండి!
రేపు—
నా పదాలు
మంటల్లో తడిసిన మంత్రాలై
ఆవేదనలో మునిగిన ప్రభంజనాలై
ఆవేశంతో ఎగిరిన చైతన్య కేతనాలై
శిశిరం ముసురుకున్న
ఈ పూల తోటల్లోకి
వాడిపోని వసంతాల్ని ఆహ్వానిస్తాయి!
నిద్రిస్తున్న మూగగొంతుకల్ని శృతి చేసి
మాసిపోని వెలుగు పాటల్ని పాడిస్తాయి!
దైన్యాల ముసుగుల్లో
దోపిడీల సంకెళ్ళలో
కలల కౌగిళ్ళలో
ముడుచుకు పడుకున్న
ఉక్కు పిడికిళ్ళకు
ప్రాణవాయువు లూది
ఆరిపోని అగ్నులుగా మండిస్తాయి!
అందుకే—
మీ బ్రతుకుల్లో
కాసేపు నడవనీయండి!
మీ గుండెల చప్పుళ్ళు వింటూ
అక్షరాల పహారా కాయనివ్వండి!!

## డా॥ ఎం. బుద్ధన్న

# గాలిబ్ ప్రణయ కవితాతత్వం

శృంగారం సంయోగమనీ, వియోగమనీ రెండుగా విభజింపబడింది. విశ్వసాహిత్యం చాలావరకు సంయోగ శృంగారంతో సాగిపోతే, ఉర్దూ సాహిత్యం వియోగంతో వేగిపోతుంది. సంయోగంలో నాయిక వెళ్ళిపోతుందన్న విచారం వుంది. వియోగంలో వస్తుందన్న సంతోషం పురులు విప్పుతుంది. అందుచేత సంయోగానికి చోటివ్వని ఉర్దూ సాహిత్యం అంతులేని ఒక వియోగ విశ్వంగా మారిపోయింది.

ఆ విశ్వమే ఒక మధుశాల. ఆ నాయికే ఒక మధుబాల. ఈ వధువే దైవం. మధువే కృపారసం. వియోగం ఒక నింత పరీక్ష. సంయోగం నిరంతర నిరీక్ష. దైవమనే మదిరాక్షి విశ్వపానశాలలో ప్రియభక్తుడైన కవిని కషణ సంస్కారిగా మార్చి, తనలో లీనం చేసుకునే ప్రయత్న విభాగమే ఈ వియోగం. కవి ఆరాటం, పోరాటం అంతా తాదాత్మ్యం కోసమే.

కవి ఆత్మలో కల్లోలాన్ని రేపే ఆ మదిరాక్షి ఒక విశ్వ వేశ్యామణి. దైవప్రతీక అయిన ఆమె దైవంలాగానే సర్వ సమానంగా వ్యవహరిస్తుంది. 'సాకీ'గా లోకాన్నే ఆకర్షిస్తుంది. చిర యౌవనపాత్రలో చిందిన సౌందర్యామృతమే ఆ సాకీ. పానగోష్ఠిలో ఆ మోహిని చేసే మెత్త మెత్తని 'షరారత్తు' లెన్నో. విసరే కైపు చూపుల కత్తులెన్నో. మనసూ, మమతా లేని ఈ అల్లరి పల్లవి, ఎంత సొగసరో, అంత గడసరి కూడా. ఈ సాకీ అందాల నగరిలో అన్నీ వుంటాయి కాని 'దయ' ఒక్కటే సున్న. కవి హృదయానికి ఒక అయస్కాంత వయస్వినిగా కనిపిస్తుంది, కవ్విస్తుంది.

సాకీ అమాంతం కవిని వేధిస్తుంది. పానగోష్ఠికి ఆహ్వానిస్తుంది. పిమ్మట పరాభవిస్తుంది. విలాసంగా విలోకిస్తుంది. వినోదిస్తూ విలపింపజేస్తుంది. ఉల్లాసంగా ఊరిస్తుంది. ఉల్లోలంగా ఉడికిస్తుంది. ఆమె విధానమే ఒక ప్రళయాంతకంగా మారిపోతుంది. ఉవిద 'షమా' అవుతుంది. ఉర్దూ కవి శలభమవుతాడు. హృదయాలను కాపాడుకోలేని 'రింద్' వంటి బందగీ కవులకు సాకీ గడపయే మరణశయ్య. ఇలా దీప శలభన్యాయంతో సాకీకీ, కవికీ తాదాత్మ్యం సిద్ధిస్తుంది. ఉర్దూలో ఇదే సూఫీ తత్వంగా భావింపబడుతోంది. ఈ తాత్త్విక నేపథ్యాన్ని ఆసరా చేసుకొని ఉర్దూ కవులు రకరకాల చమత్కార మధుమంజరీ నికుంజాల్ని సృష్టించారు. ఉర్దూ కవితావనాన్ని సుసంపన్నం చేశారు.

ఉర్దూ కవి ఒక అనిర్వచనీయమైన రాగాత్మక వేదనామయ ప్రపంచాన్ని తన ఆత్మవృత్తంలో అల్లుకుంటాడు. ఆతని మనసే ఒక ముద్దుల ముషాయిరా. అందులో జ్వాలావలయాల్ని రేపే జలతారుసీమలు, గుండెల్ని చీల్చే గుల్మొహర్లు, హృదయాన్ని కుదిపివేసే కోరికలు, విషా నిలయాలు, మోహన సాకీలు, మధుర మధనాలు నిత్యం 'సెల' లేస్తుంటాయి.

ఈ రాగజ్వాలా ప్రపంచంలో సంచరించే ఉర్దూకవి సాకీ కోసం పడరాని పాట్లు పడతాడు. అనుక్షణం పగిలిన గుండెలతో, అంతులేని ప్రయాసతో మండుటెడారుల మధ్యవర్తిగా మాడిపోతాడు. కాళ్ళకు బొబ్బల్ని కొని తెచ్చుకుంటాడు. అతివ గుర్తుకు రావాలని బొబ్బల్ని సూదులతో గ్రుచ్చుకుంటాడు. రక్త జీవన రాగాలాపన చేస్తాడు. విలాపంలోనే వింతమాధురిని చవి చూస్తాడు. ప్రియురాలి బాణం గురి తప్పగా దానిని అందుకొని మరలా వేయాల్సిందిగా ఆమెకే ఇస్తాడు. నరకలోకపు 'నకీరు'తో ముచ్చట లాడుతాడు.

రేయి నిద్రపట్టదు. చుక్కల్ని లెక్కిస్తాడు. కొవ్వువత్తితో చెలిమి చేస్తాడు. బాధను విన్నవించుకుంటాడు. వేకువను భరించలేడు. ప్రేయసి తన ఇంటికి రాకముందు వాన రాకూడదంటాడు. వచ్చాక, విరమించరాదంటాడు. సరే అంటుంది. నిరీక్షిస్తాడు. నిరాశోపహతుడవుతాడు. ఫకీరుగా, బికారిగా పరాకు చెందుతాడు. పలవరిస్తాడు.

చావును చిరునవ్వుతో స్వీకరిస్తాడు. తన శవాన్ని సాకీ వీథిగుండా తీసుకుపొమ్మంటాడు. చాన సానుభూతి చూపితే సమాధిని పెకల్చుకొని క్రీస్తులాగా పునరుత్థానం చెందుతాడు. కొత్త 'మజురూము'లో కోలుకుంటాడు. ఇంచుమించు ఉర్దూ శృంగారమంతా ఇదేవిధంగా సాగిపోతుంది. కాకుంటే పయాములు, పైగాములు కూడా తరచు పల్లవి గల్లీలనుంచి పల్లవిస్తుంటాయి. ఈ పల్లవిని తన మోహన పల్లవిగా పాడిపోయిన మహాకవి గాలిబ్, ఉర్దూ శృంగారాన్ని కొత్త అంచు

ల్లోకి తీసుకుపోయాడు. ఒక్కొక్క అంచులో కూడా లెక్క లేనన్ని మెరుగుల్ని మేళవించాడు.

గాలిబ్‌కు పదుమూడవ యేటనే ఉమ్రావ్‌బేగంతో వివాహ మయింది. ఈ బేగం సదాచార పరాయణురాలు. పతిపట్ల మిక్కిలి అనుకూలవతి. హంగుల్ని, అలంకారాల్ని సుతరామూ ఎరుగని అతివ ఆమె.

ఇంక గాలిబ్ ప్రేయసి విషయంలో అనేక వాదోపవాదాలున్నాయి. కవితల్లో వెలిబుచ్చిన ప్రణయ విషయాలన్నీ ఆయన జీవితానుభవాలే కావాల్సిన అవసరం లేదు. ద్రష్టయైన మహాకవి ఊహాప్రేయసిని కూడా సృష్టించగలడు. మృతప్రేయసి ప్రస్తావన ఆతని గజళ్ళలో కనిపించినా, అది కూడా కల్పనా జనితం కావచ్చు. అసలు ఉర్దూ ప్రేయసే ఒక ప్రతీకాత్మక సుందరి కావున, సాధ్యమైనంతవరకు గాలిబ్ ప్రణయ కవిత్వాన్ని తత్సమన్వయ దృష్టితో చూడాల్సిన అవసరముంది.

గాలిబ్ ఒక గాయాల కథకుడు. పూలు లేని ఎడారికి కూడా తన గుండె గాయాలే పూలవుతాయి. ఆ పూల గుండెల్లో పుట్టే ప్రేమ ఒక జ్వాలగా స్ఫురించింది గాలిబ్‌కి.

ఇష్క్‌పర్ జోర్ నహీఁ హై యెహ్ వొహ్ ఆతిష్ గాలిబ్
కె లగాయె న లగే ఔర్ బుఝూ యె న బనే.

ప్రణయంమీద బలాత్కారం తగదు. అది మండిస్తే మండేది కాదు. ఆర్పేస్తే ఆరిపోయేది కూడా కాదు.

గాలిబ్ చేసిన ఈ నిర్వచనం ప్రణయలోకపు సూక్ష్మ బిందువుగా కనిపిస్తుంది. దీపానికి జ్వాలయే సర్వస్వమైనట్లు, జీవితానికి ప్రేమే సర్వస్వమని గాలిబ్ అభిప్రాయపడతాడు. ఆ ప్రేమ ఒక విచిత్రమైన జ్వాల వంటిది. ఇది మనిషికి వశమయ్యేది కాదు. కనిపించే జ్వాలను రగిలింపవచ్చు. ఆర్పనూ వచ్చు. అంటే పుట్టింపవచ్చు. గిట్టింపవచ్చు. కాని ప్రేమజ్వాల కనిపించదు. అదొక మనోమధుకీల. కనిపించదు కావున మన వశం కాదు. కబళించాలంటే అదేమీ పదార్థం కాదు. దానికొక రూపం కానీ, రంగు కానీ లేవు. దానిదొక స్వతంత్ర లోకం. దానంతటదే రగిలాక, కొంత తగ్గినా జ్ఞాపక జ్వాలలలో సాగిపోతుంది. దైవాన్నైనా వశం చేసుకోవచ్చు కాని, ప్రేమ జ్వాలను అదుపులో చేసుకోలేము.

ఉర్దూలో సంయోగ శృంగారం లేదు. ఆ శృంగారాన్ని జ్వాలగా చిత్రించుట కుదరదు. కనుక ఇది వియోగజ్వాల. మనిషిని ఆత్మదగ్ధంగా మార్చే జ్వాల. ఈ జ్వాలాజగత్తులో ప్రేమికుడు పడే అగచాట్లెన్నో. వినిపించే విధుర ఘోషలెన్నో.

జ్వాలా స్ఫురణతో కవి ప్రేమ పావిత్ర్యాన్ని కాపాడుతున్నాడు. అనంతమైన చైతన్యాన్ని కూడా జ్వాలామూలంగా వ్యంజింపజేశాడు.

లోకంలో సాధారణంగా ఎదల లోతుపాతులెరుగని ఎదలన్నీ క్షణికమైన దేహ సౌఖ్యాన్ని కాంక్షిస్తాయి. అంటే కేవలం కామవాంఛలకే గురి అవుతుంటాయి. దేహగతమైన కామం క్షణికమనీ, ఆత్మగతమైన ప్రేమ సుస్థిరమనీ, ఇట్టి ప్రేమనే ప్రేమికులు కలిగి వుండాలనీ గాలిబ్ ప్రవచిస్తున్నాడు.

గర్ తేరే దిల్ మేఁ హో ఖియాల్ వసల్ మే షౌక్ కా జవాల్
మౌజె ముహీతె ఆబ్ మేఁ మారే హై దస్తోపాకె యూఁ

ప్రేయసీ సమాగమం సిద్ధించాక కూడా, ప్రియుడిలో ఉత్సాహోద్వేగాలు సమసిపోరాదు. జలతరంగోద్వేగం తగ్గుతుందా మరి.

ప్రేయసి ఒక ప్రవాహజలం వంటిది. ప్రియుడు తరంగం వంటివాడు. జలంలో కలసిపోయిన అల ఒక్కసారి మాత్రమే ఉవ్వెత్తుగా ఎగసిపడదు. అది పదే పదే సముత్సాహంతో, సముద్వేగంతో ఎగసి వస్తుంది. తరువాత జలంలోనే కలిసినా, మళ్ళీ మళ్ళీ త్రుళ్ళిపడే ఉద్వేగంతో ఉలికివస్తుంది. మరి, ప్రేమికుడు కూడా ప్రేయసీ సమాగమం కలిగాక, అతనిలో అనురాగం అంతరించిపోరాదు. అలా అంతరిస్తే అది కామమవుతుంది కాని, ప్రేమ కాదు. అల వలె నిత్యనూతన చైతన్యంతో అతనిలో అమలిన ప్రేమ ఉద్రూత లూగాలి. ఉరకలు వేయాలి. అలాంటి ప్రేమే సుస్థిరంగా మనగలుగుతుంది. ఈ స్థిరత్వాన్ని సాధించాలంటే ప్రేమికులకు ఎంతో ఆత్మావగాహన కావాలి. ప్రేమ ఆత్మకు సంబంధించిందే కాని, అవయవాలకు సంబంధించింది కాదు.

ఈ చేతనా పరీవాహాన్ని ప్రేమతత్వానికి లగించటంలో గాలిబ్ కవి ఆర్ద్రతను, స్వచ్ఛతను కూడా స్ఫురింపజేశాడు. అందుకే ఉర్దూ ప్రేయసి నిర్దయురాలైనా ప్రియుడిలో ప్రేమ తరిగిపోదు. ఆ తాత్విక ప్రేయసి కోసమే కవి ఆరాటమంతా.

మితిమీరిన సౌకుమార్యాన్ని అందుకోలేము ఒక పువ్వు పరమ సుకుమారంగా ప్రకాశిస్తుంటే, దాన్ని చూస్తూ ఆనందిస్తాము కాని 'గుల్చీ'లాగా త్రుంచివేయలేము. సొంతం చేసుకోలేము. అంత మెత్తని పువ్వుని తాకినా కూడా, దాని కోమలత్వం పాడవుతుందనే విచారం మనసున్న ప్రతివాణ్ణీ పట్టిపల్లారుస్తుంది.

కావున అందమనేది ఆనందింపదగిందే తప్ప, అనుభవింపదగింది కాదు. ఆ అందాన్ని భరించలేని గాలిబ్ ఇలా మథనపడు తున్నాడు.

ఇస్ నజాకత్ కా బురాహో వొహ్ భలే హైఁతో క్యా
హాథ్ ఆయేఁ తో ఉన్హే హాథ్ లగాయె న బనే.

చేయి తాకగానే చిమిడిపోయే ఈ ప్రేయసీ సౌకుమార్యంతో ఏమి ప్రయోజనం. ఇంత మెత్తని సుకుమారితో పొందిక కల్గినా ఆనందముండదు కావున పొందలేకున్నాను.

ప్రేయసి అపురూపమైన సుకుమారి. చేత్తో సుతారంగా తాకినా కూడా ఆ సౌకుమార్యం నలిగిపోతుంది. సుకుమారికి కాళ్ళు నొస్తే ఎవరి స్వప్న సీమకేగి వచ్చింటుందో అనిపిస్తుంది. నాజూకుదనాన్ని కూడా భరించలేని మిక్కిలి నాజూకుదనం ఆమెది. అలాంటప్పుడు ఇంతటి వల్లమాలిన సుకుమారిని పొందడంలో కూడా హాయి లేదు. కావున 'కలయిక' అనే ప్రశ్నే లేదంటూ గాలిబ్ విచారిస్తున్నాడు. అందాన్నీ, ఆనందాన్నీ ఉర్దూకవి భరించలేడు.

ప్రేయసి రూపమెంత సుకుమారమో, హృదయమంత కర్కశం. సుకుమారంగా ఆకర్షిస్తుంది, కర్కశంగా కలత పెడుతుంది. అందరాని సాకీ శృంగారం ఎలాగూ వియోగమే. ఈ వియోగానికి సౌకుమార్యం మరొక్క కారణంగా మారింది. సుకుమార రూపాన్నే అంటలేని గాలిబ్, పరుషమైన సాకీ హృదయాన్ని అంత సులభంగా అందుకోలేడు. భౌతిక సంయోగం కన్న, ఆత్మ సంయోగం మిన్న అనే సూఫీతత్వాన్ని కవి ఈ గీతంలో ధ్వనించాడు. సౌకుమార్యం సూఫీ ప్రాణం!

ప్రేమజీవికి ఆత్మార్పణ తత్వం అవలీలగా అబ్బిన గుణం. ప్రేయసి కోసం, ఉర్దూకవి చేసే ఈ త్యాగం అద్వైత సిద్ధికి మార్గం. ఆ మహామార్గదర్శి గాలిబ్ ప్రేయసితో తన జీవన సర్వస్వాన్నే ఇలా అర్పిస్తానంటున్నాడు.

పర్తువె ఖుద్ సే హైఁ షబ్నమ్ కో ఫనాకీ తాలీమ్
మైఁ భీహుఁ ఏక్ ఇనాయత్‌కీ నజర్ హోనే తక్.

సూర్యకిరణం సోకగానే మంచుబిందువు తన ఉనికిని కోల్పోతుంది. అలాగే, నీవూ ఒక వలపు చూపును నా మీద ప్రసరిస్తే నా జీవన సర్వస్వం నీకే అర్పిస్తాను. నా ఉనికినే మరచిపోతాను.

ఉర్దూలో ప్రేయసి ముఖం సూర్యబింబంతో పోల్చబడుతుంది. అందమైన ఆ ప్రేయసి మోమును అన్యులెవ్వరూ చూడరాదని, అలా చూస్తే దృష్టి తగులుతుందని ఆ సూర్యోపమానం పాటింపబడుతుంది. ఇక్కడ సుందరి ముఖం సూర్యబింబమైతే, చూపు కిరణమవుతుంది. సూర్యకిరణ స్పర్శతో మంచుబిందువు సమస్తం కరిగిపోతుంది. ప్రియురాలి చూపు సోకగానే గాలిబ్ కూడా నిలువెల్లా కరిగిపోతాడు. ఆ కరిగించే చూపు కోసం ఆతడు తన సర్వస్వాన్ని సమర్పించగలడు. హిమబిందువులాగా ఉనికినే కోల్పోగలడు. ఆముష్మికం ముందు ఐహికం గాలిబ్ కవికి తృణప్రాయం.

మధ్యాహ్న సూర్యునిది తీవ్రదృష్టి. ఉదయ సూర్యునిది నులివెచ్చని దృష్టి. ప్రేయసి ఉగ్రదృష్టితో కాక, అంటే వియోగ దృష్టితో కాక ఉదయ సూర్యునివలె నులివెచ్చని దృష్టిని తనపై ప్రసరించాలని గాలిబ్ కోరిక. వియోగంతో వేగలేననీ, సత్వరంగా తనలో లీనం చేసుకొమ్మనీ గాలిబ్ వ్యంగ్యంగా అభ్యర్థిస్తున్నాడు.

ఉర్దూకవి చూపుల యుద్ధం చేస్తాడు. కత్తి లేని ఈ కదనంలో 'సాకీ'కి అసువులు కూడా అర్పిస్తాడు. మరి, అసువు లర్పించేదాకా ఆతని గుండెల్లో గాయాల సిరులెన్నో గోము చేస్తుంటాయి. ఆ గాయాల సిరుల కోసమే గుండె ఎంతగానో నిరీక్షిస్తుంది. గాయం కాగానే దాన్ని వరంగా భావిస్తుంది. బాధకు బదులుగా హాయి కలుగుతుంది. ఆ వింత హాయిని హృదయవీణపై ఇలా వినిపిస్తున్నాడు గాలిబ్.

దిల్ సే తేరీ నిగాహ్ జిగర్ తక్ ఉతర్ గయీ
దోనోఁకో ఏక్ అదామేఁ రజామంద్ కర్ గయీ

నీ చూపు హృదయాన్ని చీల్చుకొని కాలేయంలోకి చొచ్చుకుపోయింది. మునుపు ఈ రెండూ నీ చూపు తూపులతో గాయపడాలని అభిలషిస్తుండేవి. కోరిక తీరింది కనుక ఇప్పుడు హాయిగా వున్నాయి.

ప్రేమికులందరికీ చెలుల చూపులు గుండెల్ని మాత్రమే చీలుస్తాయి. గాలిబ్ చెలి చూపులు ఆతని గుండెను చీల్చాక, తద్వారా కాలేయంలోకి కూడా చొరబడ్డాయి. దీన్నిబట్టి చెలి చూపులు ఎంత పదునైనవో తెలుస్తుంది. చూపులు అలా చొరబడినప్పటికీ గుండెకు కానీ, కాలేయానికి కానీ గాయాలైనా బాధ కలుగలేదు సరికదా తాజాహాయి కలిగింది. ఎందుకంటే ఈ రెండూ తరుణి చూపులు తగిలి తత్పరత్వం పొందాలనుకునేవి. ఇప్పుడు పొందాయి. ఇక హాయిగా గాయాల వీణల్ని మీటవచ్చు. వేడిపాట పాడుకోవచ్చు. దీనికూడా రుధిర మధువుతో అభిషేకం చేయవచ్చు. అలా చేశాక కొత్త చలువ కొలువు తీరుతుంది.

ఇదంతా చెలి చూపు కారణంగానే సిద్ధించింది. అందుకే గాలిబ్ హృదయం ఒక గాయాల గుల్మహల్.

అనుకూలమైనా, ప్రతికూలమైనా గాలిబ్‌కి ప్రేయసి చూపే కావాలి. దాని పరిణామమెలాంటిదైనా ప్రియుడు భరిస్తాడు. 'బగైరు' పాలవుతాడు. అందులోనే అతీతానందాన్ని ఆవిష్కరించుకుంటాడు.

రక్తసిక్తమైన ఇలాంటి సూఫీ శృంగారంలో ఇంతటి రక్తిమ దాగివుంటుంది. ఇలా గాయపడిన గుండెను గాలిబ్ చాలాకాలం అణచుకున్నాడు. అతనికి వియోగం మొగం మొత్తోంది. ఇంకా ఎంతకాలమని లోకానికి తెలియకుండా గాయాన్ని దాచుకుంటాడు! అసలు బాధకన్నా ఈ దాచే బాధ ఎక్కువయింది గాలిబ్‌కి. తద్విముక్తిని చాలా చమత్కారంగా పొందగలిగాడు గాలిబ్.

షక్ హోగయా హై సీనా ఖుషా లజ్జతె ఫిరాక్
తక్లీఫె పర్దదారీయె జఖ్మె జిగర్ గయా

ప్రేమికుని గాయం అణగారక, తుదకు వృక్షాన్నే ప్రయ్యలు చేసింది. అందాకా దాచటం కష్టమయ్యేది. ఇప్పుడు విముక్తి కలిగింది.

గుండె గాయాన్ని దాచటానికి రొమ్ము ఉంది. అయినా వ్రణం సామాన్యమయింది కాదు. కావున తత్ప్రభావం రొమ్మునూ కూడా సోకింది. నలుగురికీ తన ప్రణయవ్రణం తెలియకూడదని గాలిబ్ ఇంతకాలం అతికష్టంగా దాచేవాడు. క్రమంగా ఆ గాయం రొమ్మును కూడా తొలిచివేసింది. ఇంక గాయాన్ని దాచే ప్రశ్నే లేదు. అందరికీ తన గాయం తెలిసిపోయింది. నిండా మునిగాక చలే లేదన్నట్లు, వ్రణం అందరికీ తెలిసిపోయాక భయమే లేదు. కాబట్టి గాయాన్ని దాచే బాధనుంచి గాలిబ్ విముక్తి పొందాడు.

నరాల్లో ప్రవహించేది రక్తం కాదనీ, అది కన్నీటికి మూలరూపమనీ ఉర్దూకవి చెబుతాడు. విరహ రాత్రం కాటు వేయగా కన్నీటికీ రంగు వచ్చిందంటాడు అసర్. ప్రణయంలో కన్నీటి స్థానం అమోఘం. కన్నీటికి పూర్వరూపం రక్తమైతే, ప్రణయానికి పరరూపం కన్నీరు. ఆర్ద్రత లేనిది ప్రణయం కానేకాదు. కన్నీళ్ళు దుఃఖంవల్ల వస్తాయి. ఆ దుఃఖాతిశయం ఉర్దూకవికి విరహంవల్ల కలుగుతుంది. కన్నీటి ధారలకు హృదయాన్ని సిద్ధంచేసే దుఃఖలాలసుడైన గాలిబ్ ఇలా అంటున్నాడు.

కర్తాహుం జమ ఫిర్ జిగరె లక్త్ లక్త్ కో
అర్సా హువాహై దావతె మిజ్గాం కియేహువే

ఆరిన కళ్ళకు, కాలేయపు శకలాల్ని ఒకటిగా కలిపి రక్తాన్ని మళ్ళీ ప్రసరింపజేస్తాను.

మునుపు గాలిబ్ కళ్ళు సదా చెమ్మగిల్లుతుండేవి. ఆ చెమ్మకు రక్తాన్ని కాలేయం సరఫరా చేస్తుండేది-కావున, నిత్యం కళ్ళలో తడి తారట్లాడేది. అందాకా గాలిబ్ విరహం తీవ్ర రూపం దాల్చలేదని భావింపబడాలి. రాను రాను అతని విరహం విజృంభించింది. ఫలితంగా కాలేయం చీలిపోయింది. ముక్కలు ముక్కలుగా మారిపోయింది. ఇలా ప్రయ్యలయ్యాక మరి, రక్తం ఎలా నిష్పన్నమవుతుంది. రక్తం లేకుంటే కన్నీటికి గతే లేదు. ఈ అశ్రువు లేకుంటే అసలు ప్రణయమే లేదు. తానేమో ప్రణయోపాసకుడు కావున అశ్రు బిందువుల్ని చిందించక తప్పదు. అందుకే చకచకా కాలేయపు తునకల్ని ఒకటిగా సంపుటీకరించి కళ్ళకు కన్నీళ్ళను - వీటికి మూలమైన రక్తాన్ని పునఃప్రసారం చేయిస్తానంటాడు గాలిబ్.

దైవం దుఃఖంలో జ్ఞాపకం వచ్చినంతగా, సుఖంలో రాదు. అందుకే గాలిబ్ దుఃఖాన్నే వరించాడు. దుఃఖానికి ప్రతిరూపం కన్నీరు. ఈ దుఃఖం ప్రేయసివల్ల ఏర్పడింది. ఈ 'సాకీ' దైవప్రతీక. కావున దుఃఖాన్ని విడనాడే ప్రసక్తే లేదు. అశ్రువు నాపే ఆసక్తే లేదు. ధార సాగాల్సిందే! ధ్యాస వుండాల్సిందే! తద్వారా 'ముక్తి' పొందాల్సిందే!

ముక్తి కోసం గాలిబ్ చేసిన దుఃఖపూర్వక చమత్కృతి ఇది.

ప్రియుడికి ప్రేయసి ద్వారం దగ్గర మెడ త్రోపులు మామూలే. కాపలావాడితో దేహశుద్ధి కూడా సాధారణమే. వాడితో కాళ్ళ బేరం చేయగా చేయగా, 'మహా' అంటే ఒకమూల దొరికితే దొరకవచ్చు, లేకుంటే లేదు. అంతలో ప్రియురాలు తన ప్రియుణ్ణి అమానుషంగా చంపవచ్చు. పిదప, పాడె మీదకి నాలుగు పువ్వులు మాత్రం పంపవచ్చు. ఆపైన సమాధి దగ్గర కాసేపు జాలిగా విలపిస్తే విలపించవచ్చు. గాలిబ్‌కి ఇంచుమించు ఇవన్నీ సంభవించాయి. ప్రేమపీడితుడైన గాలిబ్ తన ప్రియురాలితో ఇలా మనవి చేసుకుంటున్నాడు.

అప్నీ గలీమేం ముఝ్‌కో న కర్ దఫ్న బాదె ఖత్ల్
మేరే పతేసే ఖల్ఖ్‌కో క్యోం తేరా ఘర్ మిలే

నన్ను హత్య చేశాక, నా సమాధిని నీ వీధిలో కట్టించకు. నా సమాధి చిరునామావల్ల నీ ఇల్లు అన్యులకు తెలియడమెందుకు?

ప్రేయసి హత్య చేసినందుకు గాలిబ్ బాధపడటంలేదు. తన సమాధిని ఆవిడ ఇంటికి దగ్గరి వీథిలో కట్టిస్తే మాత్రం చాలా బాధ కలుగుతుంది. ఎందుకంటే తన సమాధి ఎక్కడ వుండేది అందరికీ తెలుస్తుంది. సమాధిని చూడటానికి అందరూ వస్తారు. దగ్గరలోనే ప్రేయసి ఇల్లు వుంటుంది. కావున, అందరూ ఇంటిని, ఇంట్లోని ప్రేయసిని చూస్తారు. ప్రేయసి మామూలుదైతే కేవలం చూసి వెళ్ళిపోతారు. ఆమె అపురూప సుందరి కావున ప్రేమిస్తారు. అనవసరంగా ప్రేయసి ప్రత్యర్థులపాలు కావచ్చు. ఈ గందరగోళమంతా లేకుండా సమాధిని సుదూరంగా కట్టిస్తేనే బాగుంటుందని గాలిబ్ అభిప్రాయం.

ప్రేయసి తనకు తప్ప అన్యులకు వశం కాకూడదనే 'స్వార్థం' గాలిబ్‌లో మెండుగా వుంది. ప్రతీకా ప్రేయసి విషయంలో ఇది సాధ్యం కాదు. సర్వులకూ సంస్కారాల్ని బట్టి సన్నిహితం కావడమే ఆవిడ ధ్యేయం.

దేవదూతల్లాగా, ప్రేమదూతలు కొందరు ఉర్దూలో సంచారం చేస్తారు. పురుషులే ఈ ప్రేమ సమాచారాల్ని చేరవేస్తుంటారు. ఈ 'నామబర్లు' ప్రేయసీ ప్రియులకు వారధుల వంటివారు. సాధారణంగా ప్రియురాలినుంచి అనుకూలమైన లేఖ రాదు. ప్రియుడే అనుకూలంగా వ్రాసి పంపుతుంటాడు. దీనికి ప్రేయసినుంచి వచ్చే సమాధానం ప్రియుడూహిస్తాడు. ఆ ఊహా వ్యామోహిగా గాలిబ్ ఇలా ఆత్రపడ్డాడు.

ఖాసిద్ కే ఆతే ఆతే ఖత్ ఏక్ ఔర్ లిఖ్ రఖూ
మై జాన్తాహూఁ జో వోహ్ లిఖేంగే జవాబ్ మే

ప్రేయసి నుంచి వచ్చే సమాధాన లేఖ ఎలాంటిదో తెలుసు కావున, బదులుగా ముందే ఒక ఉత్తరం వ్రాసి పెట్టుకుంటాను.

మొదట ఒక ప్రణయలేఖను వ్రాసి, ప్రేయసికి దూత ద్వారా పంపాడు గాలిబ్. ఇంక ఆమె 'నిందాసహోక్తికమైన' ఉత్తరాన్ని ఎలాగూ బదులుగా వ్రాసి పంపుతుంది. ఆ లేఖలో ఎలాంటి దూషణలుంటాయో కూడా గాలిబ్‌కు తెలుసు. అతడా మాత్రం ఊహించుకోగలడు. అతడా దూషణల్ని స్తుతిస్తూ మరొక్క లేఖ వ్రాసి సిద్ధం చేసుకొంటే వచ్చిన దూతకు తక్షణమే ఇచ్చి పంపవచ్చు. దూత ఇచ్చిన లేఖను తీరికగా చదువుకోవచ్చు. ఎందుకంటే దూత తెచ్చిన లేఖను చదివి, అటుపిమ్మట సమాధానం వ్రాసి పంపాలంటే చాలా ఆలస్యమవుతుంది. ముందుగానే వ్రాసిపెట్టుకొని వుంటే, వెంటనే పంపుతున్నందువల్ల లేఖ శీఘ్రంగా ప్రియురాలికి చేరి తీరుతుంది.

తనపట్ల ప్రేయసికి వలపు లేకుంటే, ద్వేషమైనా సరే వుండాలంటాడు గాలిబ్. రాగద్వేషాల్లో ఏది వున్నా, దాని ద్వారానే ఆత్మసాన్నిహిత్యాన్ని సంపాదించుకుంటాడు. ఇప్పుడీ ద్వేష మార్గంద్వారా ప్రేమాయణం కొనసాగిస్తున్నాడు. బంధ స్మృతులు విస్మృతం కాకూడదని, ఆత్రతతో ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా బంధాన్ని బలీయం చేసుకోవటానికి నానా యాతన పడుతున్నాడు గాలిబ్.

'మజ్నూ'లాగా ప్రియుడు అడవులపాలు కావడం అరబ్బీ సంప్రదాయంగా భావింపవచ్చు. ప్రేయసి ఇంట్లో వుండగా, ప్రియుడు మాత్రమే ఇల్లు వదలి డొంకల పాలవుతున్నాడంటే—అతనిలోని బలవత్తరమైన ఉన్మాదమే కారణమనాలి. మజ్నూ అంటే కూడా ఉన్మత్తుడని అర్థం. అందుకే లైలా (రేయి) ను వలచాడు. కాని ఈ ఉన్మాదం అలౌకికం. ప్రియుణ్ణి కషణ సంస్కారిగా ప్రేయసి మార్చడమంటే — ఆత్మ సంస్కారాన్ని పెంచడమే. ఈ ఆనందంలో భౌతిక సుఖదుఃఖాలేవీ పరిగణనలోనికి రావు. ఈ విధానాన్ని అతీతానంద సన్నిధానంగా చిత్రించగలిగాడు గాలిబ్.

ఇన్ ఆబ్లోఁ సే పావ్ కే ఘబ్రా గయాథా మై
జీ ఖుష్ హువా హై రాహ్ కో పుర్‌ఖ్వార్ దేఖ్‌కర్.

కాలిబొబ్బల్ని చూచి గాభరాపడ్డాను. దారి ముండ్లను చూచి సంతోషపడ్డాను.

గాలిబ్‌కు ప్రేమోన్మాదం ముదిరిపోయింది. ఈ దశలో అడవులన్నీ తిరిగాడు. ఫలితంగా కాళ్ళకు బొబ్బలు కలిగాయి. ఈ బొబ్బలకు కారణం ప్రేయసి. మరి బొబ్బలు మానిపోతే ప్రేయసి జ్ఞాపకం రాదేమో! ఆ ధ్యాసే వుండాలంటే బొబ్బలు మానిపోరాదు. అంతలో అతని దృష్టి దారిమీద పడ్డది. అది కంటకమయం. ఆ ముండ్లను చూడగానే గాలిబ్‌కు మహానందం కలిగింది. వాటితో బొబ్బల్ని గ్రుచ్చుకుంటాడు. రక్తం చిందుతుంది. గాయం రేగుతుంది. తత్కారకురాలైన ప్రియురాలు సదా స్మరణకు వస్తుంది. ఈ స్మరణానందమైనా గాలిబ్‌కి దక్కకుంటే ఎలా?

ప్రియుడు రెండంగుళాల చొక్కాను నాలుగంగుళాలు అయ్యేట్లు చింపుకుంటాడు. ప్రేయసి ముందు వస్త్రసౌందర్యం ఆకర్షణకు దారితీస్తుంది. కాని ప్రతీకా ప్రేయసి ముందు ఈ భౌతిక సౌందర్యం పనికిరాదనీ, ఆత్మసౌందర్యమే అవసరమనీ, అందుకే ఉర్దూ ప్రియుడు ఆచ్ఛాదనల్ని సైతం అభిలషించడం లేదనీ భావింపబడాలి. గాలిబ్ 'ఆషిక్‌కీ గలేబాహోనా'—

'ప్రేమలో చౌకా్కా చీలిక' అంటూ పై తాత్విక సంప్రదాయాన్ని పోషించాడు.

ఈ విధంగా గాలిబ్, తన కవిత్వంలో తాత్వికమైన ప్రణయాన్ని ధ్వనింపజేశాడు. ప్రేయసి సన్నిహిత అనుభూతి కావున తన సర్వస్వాన్ని వివరించటానికి అనువైన ఆధారం. అలా ప్రేయసివి ఆధారంగా చేసుకొని, గాలిబ్ వినిపించిన ఆత్మఘోషయే - ఆతని ప్రేమతత్వం!

## అర్థ వివరణలు :

1) షరారత్=చిలిపిచేష్ట, 2) షమా=దీపం 3) బందగీ=దాసోహం 4) ముషాయిరా=కవి సమ్మేళనం 5) నకీర్=ఒక నరకలోకపు దూత 6) మజ్రూమ్=కొత్త స్థితి 7) పయామ్=రాయబారం 8) పైగామ్=వార్త 9) గుల్చీ=పూలు త్రుంచేవాడు 10) నామబర్=వార్తాహరుడు.

## ఆధార గ్రంథాలు :

1) గాలిబ్ గీతాలు - దాశరథి, 2) ఈ నగరం జాబిల్లి - శేషేంద్ర, 3) జ్వాలాహసంతి - ఎం. బుద్ధన్న, 4) ఏరి కూర్చిన గజళ్ళు - రషీద్ ఖురేషి.

# ఇంతా చేసి ఏం చూసింది నేల...?

## శ్రీ సాంధ్య శ్రీ

చిగురు మేళాలు
వర్ణస్వరాల్ని ధ్వనింపచేస్తున్న ఈ ఆశాహరితం
అతని కన్న తొలి కల!

నిట్టూర్పుల్ని రాలుస్తున్న
శిశిర గళంలోంచి
ఋతుత్యాగర కొత్త గీతాల్ని పల్లవిస్తోంది!

గాలి పూల పెదిమల్ని కదిపితే
రాలి పుప్పొడి చినుకులు
పుడమిని అభిషేకిస్తాయి....

శాపవశాన దేవతలు శబంతాలై
వసంత వృక్షాన్ని నివాసం చేసుకొని
దిక్కుల్లోకి పాటల జెండాల్ని ఎగరేస్తాయి...

పువ్వుల్ని పులకింతల్ని
నిద్రలేపిన ఈ ఋతువు
దేశంమీదికి సీతాకోక చిలుకల్ని వదిలింది....

స్మృతుల సైకతంలో
ముక్తా పద పాద చిహ్నాలను
వదిలింది అడుగులు మోసిన నేల...

అయనాల నయనాల కాలానికి
ఆశా కర్పూర దీపానికి
మధ్య మనిషిని నిలిపింది నేల...

బ్రతుకు పరిమళ క్రతువు కావాలన్న
ఈ నేల పౌరాతన్యం
కలల్ని కన్నీళ్లలో తడిపినవాడ్ని చూస్తోంది.

ఒడిరాలిన ఆకులోంచి
పిడికెడు ప్రేమను బీజం చేసిన నేల
కట్టెలు కొడుతున్న మనిషిని చూస్తోంది....!!!

శ్రీ పి. ముత్తయ్య

# ప్రాచీన భారతదేశములో గ్రామీణ న్యాయ పంచాయతీలు

ఆదిమకాలము నుండి ఆధునిక యుగం వరకు గ్రామీణ సాంఘిక, ఆర్థిక, రాజకీయ సంస్థలు ఆదర్శ సంస్థలుగా నిలిస్తాయి. వేదయుగంలోనూ పాలనాపరంగా గ్రామాలు ప్రాథమిక ఖండికలని మనువు పేర్కొన్నాడు. గ్రామ పాలనా వ్యవస్థ సాంఘిక, ఆర్థిక మత విధులతోపాటు న్యాయపాలనా కూడా తమ ప్రాథమిక విధులలో ఒకటిగా నిర్వహించినది. ప్రాచీన గ్రామీణ న్యాయ పంచాయతీలు అనధికారిక మైనప్పటికి మనకు అందుబాటులో ఉన్న కొన్ని చారిత్రక గ్రంథాలు వీని పనితీరుకు అద్దం పడతాయి. మన దేశాన్ని పరిపాలించిన మొఘలు సామ్రాజ్యాధినేతలు ప్రాచీన గ్రామీణ సంస్థలలో మార్పులు చేపట్టుటకు ఎక్కువ శ్రద్ధ వహించనందున అవి బ్రిటిష్ పరిపాలన మొదలయ్యేవరకు వర్ధిల్లినవి. బ్రిటిషువారి కాలంలో మన దేశపు వివిధ వ్యవస్థలు అనూహ్యమైన మార్పులకు లోనయినవి. అట్టివానిలో గ్రామీణ న్యాయ పంచాయతీ వ్యవస్థ ఒకటి. నిజానికి బ్రిటిష్ వారి కాలంలోనే గ్రామీణ న్యాయపంచాయతీ వ్యవస్థ ప్రాధాన్యత తగ్గుముఖం పట్టినది. అయినను 1907-08 సంవత్సరాలలో ప్రజాస్వామ్య వికేంద్రీకరణ లక్ష్యంతో న్యాయ పంచాయతీలను ఏర్పాటుచేసి కొన్ని న్యాయ విధులను అప్పగించుటకు ప్రయత్నం జరిగినది. 1915 సంవత్సరంలో న్యాయ పంచాయతీల ఏర్పాటు బాధ్యత రాష్ట్రాలకు ఇస్తూ భారత ప్రభుత్వం ఒక తీర్మానం చేసినది. అయినప్పటికి న్యాయ పంచాయతీల ఏర్పాటుకు గట్టి ప్రయత్నం 1933 బొంబాయి గ్రామ పంచాయతీల చట్టం ద్వారా అయినది. ఆ తర్వాత 1939, 1947లలో సవరించిన చట్టాల ద్వారా న్యాయ పంచాయతీలకు న్యాయాధికారాలు అప్పగించినారు. బలవంతరాయ్ మెహతా నివేదిక ద్వారా న్యాయ పంచాయతీలకు అవసరమైన అధికారులను నియమించే అధికారాలు జిల్లా లేదా సబ్ డివిజనల్ మెజిస్ట్రేటుకు ఇవ్వాలని సిఫారసు చేసినారు. ప్రజాస్వామ్య వికేంద్రీకరణ లక్ష్యంతో పంచాయతీరాజ్ సంస్థలను ఏర్పాటు చేసిన తర్వాత అనేక రాష్ట్రాలు గ్రామీణ న్యాయ పంచాయతీలను ఏర్పాటు చేసినవి. ఉత్తరప్రదేశ్, గుజరాత్, త్రిపుర, పశ్చిమ బెంగాల్, రాజస్తాన్, బీహార్, మణిపూర్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, హిమాచల్ ప్రదేశ్, జమ్మూ - కాశ్మీర్, మొదలగు రాష్ట్రాలు న్యాయ పంచాయతీలను ఏర్పాటు చేసినవి. భారతదేశంలో అధికారిక న్యాయ పంచాయతీలతోపాటు అనధికారిక న్యాయ పంచాయతీలు అనేకం పని చేయుచున్నవి. ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీల చట్టం న్యాయ పంచాయతీల ఏర్పాటుకు సదుపాయం కల్పించినది. కానీ కాంగ్రెసు ప్రభుత్వం వీనిని ఏర్పాటు చేయలేదు. 1983లో తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత పాలనపరంగా అనేక మార్పులు తెచ్చినది. అందులో భాగంగా ప్రభుత్వం గ్రామీణ న్యాయ పంచాయతీల ఏర్పాటుకు కృతనిశ్చయంతో ఉన్నది.

## ప్రాచీన భారతదేశంలో గ్రామీణ న్యాయ పంచాయతీలు :

ప్రాచీన భారతదేశంలో గ్రామీణ న్యాయ పంచాయతీలను వివిధ పేర్లతో పిలిచినారు. బృహస్పతి, యాజ్ఞవల్క్య స్మృతుల ద్వారా అవి "కులా" "పుగా" "శ్రేణి" అనెడి పేర్లతో పిలువబడినట్లు తెలుస్తుంది. పాలన క్రమశ్రేణిలో కులా న్యాయ స్థానం దిగువ స్థాయిలోను శ్రేణి మధ్యస్థాయిలో ఉండగా పుగా న్యాయస్థానం అగ్రస్థాయిలో ఉంటుంది. కులా న్యాయస్థానంలో సమిష్టి కుటుంబాల, కులాలవారు బంధువులు సభ్యులుగా ఉంటారు. గ్రామీణ న్యాయస్థానాలు పదినుండి నలుబది గ్రామాలకు విస్తరించి ఒక ఖండికగా ఉన్నట్లు చారిత్రకాధారములున్నవి. అర్థశాస్త్రంనాటి గోప అట్టి ఖండికకు అధికారిగా ఉన్నట్లు తెలియుచున్నది. శ్రేణి కోర్టులలో వివిధ కులాలకు చెందినవారు, వ్యాపారస్తులు, చేతి పనులవారు ప్రతినిధులుగా ఉంటారు. ధర్మరాజు పట్టాభిషేక ఉత్సవానికి వృత్తి సంఘాల ప్రధానాధిపతులు హాజ

రైనట్లు మహాభారతం చెబుతుంది. పుగా న్యాయస్థానాలలో ఒకే గ్రామంలో వివిధ కులాలకు చెందిన, వృత్తులకు చెందినవారు ప్రతినిధులుగా ఉంటారు.

**శాసన ప్రాతిపదిక ఉందా?**

ఏ యుగంలోనైనా, సమాజాలలోనైనా సాంఘిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థలు లిఖితరూపంలో గాని, అలిఖిత రూపంలోగానీ ఉన్న నియమ నిబంధనలకు అనుగుణంగా పని చేస్తాయి. ప్రాచీన గ్రామీణ న్యాయ పంచాయతీల నిర్వహణకు మూలమైన శాసన ప్రాతిపదికలను కౌటిల్యుని అర్థశాస్త్రం నాలుగు విధాలుగా పేర్కొంటుంది. అవి; ధర్మభావన, వ్యవహారిక నియమాలు, చారిత్రక ఆచారాలు, రాజశాసనాలు. వీటన్నింటిలో ధర్మం అత్యున్నత శాసనంగా పరిగణింపబడినట్లు నారద, చాణుక్యుల అభిప్రాయం. వీరి అభిప్రాయానికి భిన్నంగా మనువు, ఇతర ధర్మశాస్త్రజ్ఞులు న్యాయ నిర్వహణలో ఆచారాలు అతి ముఖ్యమైనవిగా పరిగణించి, కులాలు, శ్రేణుల, జాతుల ఆచారాల ఆధారంగా వివాదాలు పరిష్కరింపబడాలని వివరించినాడు. దీనివిబట్టి ప్రాచీన భారతదేశంలో ధర్మము, నైతిక నియమాలు, ఆచార సాంప్రదాయాలు, న్యాయ నిర్వహణలో ప్రాతిపదికగా ప్రధాన పాత్ర వహించినట్లు అర్థమవుతుంది.

**న్యాయ పంచాయతీల నిర్మాణము :**

ప్రాచీన భారతదేశంలో పనిచేసిన గ్రామీణ న్యాయ పంచాయతీల నిర్మాణం అర్థశాస్త్రం స్పష్టంగా వివరిస్తుంది. గుప్తుల కాలంలోని గ్రామీణ న్యాయ పంచాయతీలు హెడ్‌మెన్ మరియు పెద్దలతో నిర్మితమైనవి. వీరినే మహత్తరాస్ అవి, మహాజన్స్ అని వివిధ ప్రాంతాలలో, వివిధ భాషలలో వ్యవహరించేవారు. కౌటిల్యుడు, మెగస్తనీసు రచనలనుబట్టి వీరి సంఖ్య ఐదు. అందువలన వీరిని పంచాస్ అని చంద్రగుప్త మౌర్యుని కాలంలో వ్యవహరించేవారు. దీని ప్రధాన న్యాయాధిపతి హెడ్‌మెన్. ఈతనిని గ్రామిని అంటారు. హెడ్‌మెన్ పదవి అనువంశికంగా సంక్రమించేది. గ్రామ పెద్దగా బ్రాహ్మణేతరులు ముఖ్యంగా క్షత్రియులుండేవారు. లేని పక్షంలో వైశ్యులు గ్రామ పెద్దగా వ్యవహరించేవారు. వివాదాలు పరిష్కరించుటలో మెజారిటీ నిర్ణయం ప్రకారం తీర్పులిచ్చినారు.

**అధికార పరిధి :**

ప్రాచీన గ్రామీణ న్యాయ పంచాయతీల అధికార పరిధి పరిమితమైనది. క్రిమినల్ నేరాల పరిధి మరీ పరిమితమైనది. దీనిని రెండు విధాలుగా చెప్పవచ్చును. ఒకటి ప్రాదేశిక అధికార పరిధి, రెండు విధుల పరమైన అధికార పరిధి. మొదటి రకమైన అధికార పరిధి ఒక గ్రామానికి లేదా పదినుండి నలభై గ్రామాలకు విస్తరించినట్లు చెప్పుతారు. కౌటిల్యుడు తన అర్థశాస్త్రము ద్వారా చెప్పిన విధుల పరమైన అధికార పరిధి చాలా పరిమితమైనది. ఋణాలు, అమ్మకాలు, కొనుగోళ్లు, సరిహద్దు తగాదాలు, లైంగిక నేరాలు, దొంగతనము, నీటిపారుదల, భూములు మొదలగువానికి సంబంధించిన వివాదాలను గ్రామీణ న్యాయ పంచాయతీలు పరిష్కరించినవి. న్యాయ పంచాయతీల పౌర నేరాల అధికార పరిధి చాలా విస్తృతమైనది. ధనపరంగా ఎంత మొత్తానికి సంబంధించిన నేరాలనైనా ఈ న్యాయస్థానాలు విచారించవచ్చు.

**సాక్షులు - సాక్ష్యాధారాలు :**

ప్రాచీన గ్రామీణ న్యాయ పంచాయతీలలో సాక్షులను, సాక్ష్యధారాలను ప్రవేశపెట్టిన విధానానికి సంబంధించిన నిర్దిష్ట చారిత్రక ఆధారాలు కనిపించవు. నేటికిని కొన్ని గ్రామాలలో ఆచరించబడుతున్న కొన్ని సాంప్రదాయాలు ప్రాచీన న్యాయ వ్యవస్థలలో ఆదరించినట్లు తెలుస్తుంది. లిఖిత సాక్ష్యధారాలు రాజులచే కానీ స్థానికులచేగానీ ధృవీకరింపబడేదివి. సాక్షుల విషయంలో స్థానికులు లేదా స్థానిక వృత్తులవారికి ప్రాధాన్యం ఉన్నట్లు ఏ. యస్. ఆల్టేకర్‌గారు పేర్కొన్నారు. వివాదానికి సంబంధించిన నిజానిజాలు స్థానికులకే తెలుస్తాయి. వారు అబద్ధ సాక్ష్యం చెబితే గ్రామంలో గౌరవం పోతుందని భయంతో నిజం పలికే అవకాశం ఉన్నందున స్థానికులకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చినారు. వివాదంలో ఉన్న వాస్తవాన్ని ధృవీకరించుటలో ప్రమాణాలు కఠిన పరీక్షలు ప్రముఖపాత్ర వహించినవి. సాక్షులు, నేరారోపణ చేసినవారు, చేయబడినవారు ప్రమాణం చేయవలసి వుంటుంది. దీనితోపాటు వాస్తవాన్ని నిరూపించుటలో కఠిన పరీక్షలు నేటికి కొన్ని గ్రామాలలో ఉపయోగిస్తున్నారు. అగ్ని పురాణం వివిధ రకాల పరీక్షలు వివరించినది. తులామానం, కాలుచున్న ఇనుప కడ్డీలను చేతులతో దూయుట, నిప్పులోనుండి నడచుట వంటి కఠిన పరీక్షలు ద్వారా వాస్తవాలను నిరూపించినారు. కఠిన పరీక్షలకు గురైనవారికి ఏ గాయం కాకున్నట్లయితే నిర్దోషిగా నిరూపించబడినట్లు భావిస్తారు. ఈ పరీక్షలు నిర్దోషి విడుదలై. దోషి శిక్షింపబడుతాడనే దైవసంబంధమైన విశ్వాసంపై ఆధారపడినవి.

**అప్పీళ్ల విచారణాధికారము :**

దిగువ కోర్టులలో విచారించిన వివాదాలలో న్యాయం జరుగనపుడు ఎగువ కోర్టులు విచారించే అధికారాన్ని అప్పీళ్ల అధికారము అంటారు. ప్రాచీనకాలంలో కూడ అప్పీళ్ల అధికారం నేటి న్యాయవ్యవస్థవలెనే క్రమశ్రేణిలో ఉండెడిది. బృహస్పతి ప్రకారం కులా కోర్టులో విచారించిన వివాదాలు, శ్రేణి కోర్టుకు, శ్రేణి కోర్టునుండి పుగా కోర్టుకు అప్పీళ్లుగా స్వీకరించబడినవి. జోల్లే నారద అప్పీళ్లు మూడు స్థాయిలలో ఉన్నట్లు పేర్కొన్నాడు. గ్రామ కోర్టులలోని వివాదాలు పట్టణ కోర్టులలోను, పట్టణ కోర్టులలోని వివాదాలు రాజు కోర్టులలోకి అప్పీళ్లుగా స్వీకరించినారు. రాజు కోర్టులలోని తీర్పులు అంతిమ తీర్పులు. దీన్నిబట్టి అప్పీళ్ల విచారాణాధికారము నేటి న్యాయస్థానాలలో వలెనే దిగువ కోర్టులనుండి ఎగువ కోర్టులకు అనుమతించినారు.

న్యాయ పంచాయతీల పరిగణన – నాడు నేడు

నాడు గ్రామాలు సహజ పరిస్థితులలో, వాతావరణంలో నిర్మింపబడినవి, నేడట్టి పరిస్థితులు ఆదిమ సమాజాలలో కూడ కనిపిస్తాయి. ప్రాచీన భారతదేశంలోని ప్రజల ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులు సహజ పరిస్థితులతో నిబంధించబడినవి. మానవుని శాస్త్రీయజ్ఞానం పెరిగి నాగరికత, నగరీకరణం పెరిగే కొలది ఆయా రంగాలలో నైతిక ప్రమాణాలు తరుగుతూ వస్తున్నవి. నేడు నగరాలలో హెచ్చు స్థాయిలోనూ, గ్రామాలలో తక్కువ స్థాయిలోను కృత్రిమ పరిస్థితులతో జీవన విధానం నిబంధించబడుచున్నది. పాశ్చాత్య సంస్కృతి, చలన చిత్రాలు, మరియు ఇతర సాధనాల ద్వారా గ్రామాలలోని సహజ పరిస్థితులను కలుషితం చేస్తున్నవి. అనధికారికంగా నాడు పనిచేసిన, నేడునూ పనిచేయుచున్న గ్రామీణ న్యాయ పంచాయతీలను సరిపోల్చినట్లయితే నైతిక ప్రమాణాలు ఏ విధంగా ఉన్నవి, న్యాయ పంచాయతీల భవిష్యత్తు ఏమిటో అర్థమవుతుంది. అందుకు గత 25 సంవత్సరాల క్రితం సహజ పరిస్థితులలో పనిచేసిన న్యాయ పంచాయతీలు నేడు అనధికారికంగా పనిచేయుచున్న న్యాయ పంచాయతీలను పోల్చుటద్వారా ఊహించవచ్చును.

ధర్మభావన, ప్రాచీన భారత ప్రజల జీవన విధానాన్ని బహుముఖంగా ప్రభావితం చేసింది. ధర్మాన్ని రక్షించేవారిని ధర్మం రక్షిస్తుంది. ధర్మాన్ని నాశనం చేసేవారిని ధర్మం నాశనం చేస్తుందని అన్ని రంగాలలో అన్ని వర్గాలవారు విశ్వసించేది. నాడు న్యాయమూర్తులు కూడ ధర్మరక్షణకు కృషి చేసినారు. నేడు దానికి విరుద్ధంగా రాజకీయాలలో, న్యాయ వ్యవస్థలో ధర్మాన్ని రక్షిస్తే అది తమను భక్షిస్తుందనే స్థితి వచ్చినట్లనిపిస్తుంది. స్వార్థపరులైన వ్యాఖ్యాతలు ధర్మభావనను తమ వర్గ ప్రయోజనానికి, చివరకు కుల ప్రయోజనాలకు అనుగుణంగా వ్యాఖ్యానించడం మొదలెట్టిన తర్వాత ప్రాచీన కాలంలో జీవన విధానానికి పట్టుకొమ్మగా ఉన్న ధర్మభావన నేడు సర్వత్రా అవహేళన చేయబడుచున్నది. నాడు అన్యాయ తీర్పుకు బాధ్యులైన న్యాయమూర్తులు, సాక్షులు, అర్థి, ప్రత్యర్థులు మధ్య అధర్మం పంపిణీ అవుతుందని దాని ద్వారా వారు నాశనం అవుతామని విశ్వసించేవారు. నేడు అధర్మపు తీర్పులు ఇచ్చినపుడు మాత్రమే లంచాలు పంచుకోవడం సాధ్యమవుతుందని దానిద్వారా మాత్రమే కుటుంబం బాగుపడుతుందనే స్థితికి ఆయా వర్గాలు దిగజారినవి.

ప్రాచీన గ్రామీణ న్యాయ పంచాయతీలకు ప్రధాన న్యాయమూర్తిగా వ్యవహరించిన హెడ్‌మెన్ పదవి అనువంశికంగా సంక్రమించుట వలన తాను ధర్మబద్ధంగా, స్వతంత్రంగా, నిష్పక్షపాతంగా వ్యవహరించేది. దాంతో హెడ్‌మెన్ వంశానికి, కుటుంబానికి, కుటుంబ సభ్యులకు ప్రత్యేక గౌరవం ఉండేది. నేటికి కొన్ని గ్రామాలలో హెడ్‌మెన్ అనువంశికంగానే కొనసాగుచున్నారు. గత 25 సంవత్సరాల క్రితం వీరి పనితీరును, నేడు వారి పనితీరును పోల్చినట్లయితే పూర్తిగా భిన్నమైన స్థితి కొనసాగుతున్నది. హెడ్‌మెన్ పదవిలో కొనసాగుతున్న వంశాలు, కుటుంబాలు అపకీర్తి పాలయి అవసాన దశలో మనకు కనిపిస్తాయి.

ప్రాచీన న్యాయస్థానాలలో న్యాయవాదులుగా వ్యవహరించిన కుల సభ్యులు తమ తమ కులాలకు అన్యాయం జరుగకుండా కృషి చేసేవారు. దాంతో అన్ని కులస్తులకు ఉత్తమ తీర్పులు అందేవి. న్యాయ విచారణలో కుల సభ్యులు లేనట్లయితే ఉత్తమ తీర్పు అసాధ్యమని మనువు మాటలద్వారా అర్థమవుతుంది. కానీ నేటి న్యాయ పంచాయతీలలో న్యాయవాదులుగా చెలామణి అవుచున్న కులపెద్దలు తమ కుల ప్రయోజనాలకన్నా స్వీయ ప్రయోజనాలకు, గ్రామంలోని ముఠా, పార్టీ, రాజకీయ నాయకులకు అనుకూలంగా వ్యవహరిస్తున్నారు. కులం పేరుతో స్వీయ ప్రయోజనాలకు కృషి చేయడం మనకు నేడు అనేక రంగాలలో కనిపిస్తుంది.

ప్రాచీన గ్రామీణ న్యాయ పంచాయతీలలోని ఐదుగురు న్యాయమూర్తులు అధిక సంఖ్యాకుల నిర్ణయం ప్రకారం వివాదాలల్లో తీర్పులిచ్చేవారు. నేడు కూడ అనేక గ్రామాలలో అదే విధానం

కొనసాగుతుంది. కానీ ఆ పద్ధతిలో కొంత పరిమాణాత్మకమైన మార్పు వచ్చినది. అదేమనగా గ్రామాలలో లుంగిసేన అనగా ఎస్.ఎస్.సి., ఇంటర్, డిగ్రీ ఇతరత్రా పాసైన, ఫెయిలయిన యువకులు ఉద్యోగాలు దొరకక లుంగీలు కట్టుకొని తిరిగేవారు. వారిని అనుకరించే నిరక్షరాస్యులు వివాదంలోని అర్థి, ప్రత్యర్థులైన ఇరుపక్షాల తరఫున ప్రదర్శించే సంఖ్యాబలం, అవసరమైతే కండబలం ఆధారంగా తీర్పులు ఇస్తున్నారు.

ప్రాచీన కాలములో గుణము, శీలము కలిగి, ముక్కుసూటిగా వ్యవహరించే వ్యక్తులను సాక్షులుగా అనుమతించినట్లు మనుధర్మ శాస్త్రం చెపుతుంది. దానికితోడు స్థానికులు సాక్షులుగా నిజానిజాలు తెల్సియుండి అబద్ధ సాక్ష్యం చెపితే గౌరవం పోతుందనే భయంతో నిష్పక్షపాతంగా సాక్ష్యం చెపుతారని స్థానికులకే ప్రాధాన్యం ఇవ్వబడినది. కానీ నేడు గ్రామాలలో స్థానికులే సాక్ష్యం ఇస్తున్నప్పటికీ నిజమైన సాక్షులు, వివాదాలకు భయపడి దూరంగా ఉంటుండగా నకిలీ సాక్షులు, అబద్ధ సాక్షులు ముందుకు వచ్చి స్థానిక నాయకులకు అనుకూలమైన తీర్పులకు తోడ్పడుచున్నారు. ప్రజలలో భౌతికవాదంపై విశ్వాసం పెరుగుట వలన దేవుని అస్థిత్వంపై నమ్మకం తగ్గినందున వాస్తవాల నిరూపణలో ప్రమాణాలు, కఠిన పరీక్షలకు ఉన్న స్థానం క్రమంగా పడిపోవుచున్నది.

నాడు గ్రామీణ న్యాయ పంచాయతీలు రాజకీయాలకు వీలయినంత దూరంలో ఉండేవి. రాజులు స్థానిక వివాదాలు స్థానికులకే వదిలివేశారు. అంతేకాక న్యాయ పంచాయతీలు అనధికారికంగా ఉండి స్వతంత్రంగా వ్యవహరించెడివి. నేటి న్యాయ పంచాయతీలు, న్యాయాధిపతులు ఆయా గ్రామాల రాజకీయ నాయకుల ఆధీనములో ఉండి తమ పార్టీ అభిమానులు, మద్దతుదారులకు అనుకూలంగా తీర్పులు ఇస్తున్నారు.

ప్రాచీన కాలంలో దిగువ కోర్టులలో న్యాయం జరుగనివారు ఎగువ కోర్టులకు స్వేచ్ఛగా అప్పీళ్లు చేసుకొన్నారు. కానీ నేడు గ్రామ ప్రజలు అప్పీళ్లకే కాదు ప్రథమ విచారణకు కూడ ఎగువ కోర్టులకు వెళ్లే అవకాశం లేదు. ఎందుకంటే గ్రామ పెద్దలను కాదని, వారి తీర్పులను కాదని గ్రామాలలో స్వేచ్ఛగా బ్రతకడం కష్టం. కావున ప్రజలు గ్రామాలలో తమకు వ్యతిరేకమైన తీర్పులు వచ్చినప్పటికి విధిలేక శిరసావహించవలసి వస్తున్నది.

ప్రాచీన కాలంలో ప్రజాభిప్రాయం రాజుకంటే బలమైనదిగా పరిగణింపబడినది. న్యాయమూర్తులు, పెద్దలు, సాక్షులు, నేరస్తులు, అధికారులు ప్రజాభిప్రాయానికి లోబడి ఉండేవారు. నేరస్తులు ప్రజాభిప్రాయానికి భయపడి తలవంచుకుని జీవించేవారు. దీనికి భిన్నంగా నేడు ఆయా వర్గాలవారు ప్రజాభిప్రాయాన్ని లెక్కచేయక వారే నిర్భయంగా తలఎత్తుకుని తిరుగుచున్నారు. ప్రజాభిప్రాయానికి భయపడి జీవించేవారి సంఖ్య, తీర్పులిచ్చేవారి సంఖ్య క్రమంగా తగ్గుచున్నది.

ప్రాచీన న్యాయ పంచాయతీలు వివాదంలో గెలిచినవారి వద్ద 10 శాతము, ప్రత్యర్థివద్ద 5 శాతం స్టాంపు డ్యూటీగా వసూలు చేసినవి. అందులో కొంత భాగము పంచాస్ గౌరవ భృతిగా స్వీకరించినారు. నేటి గ్రామ న్యాయస్థానాలలో పెద్దలు వివాదాల విచారణకు ముందే వివాదంలోనున్న ఇరుపక్షాలనుండి మద్యం స్వీకరించిన మరునాడు ఉదయం వివాదాలు పరిష్కరిస్తున్నారు. వివాదానికి సంబంధించిన స్టాంపు డ్యూటీలు వసూలు చేసే మొత్తం పెద్దల అవసరాలనుబట్టి ఉంటుంది. దానితోపాటు వివాదంలో గెలిచినవారికి చెందవలసిన నష్టపరిహారము నుండి గ్రామ పెద్దలు భాగం పంచుకుంటున్నారు.

ముగింపు :

ఆంగ్లేయుల పాలనా కాలములోనూ, స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత మన ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలలో అనూహ్యమైన మార్పులు వచ్చినవి. తత్ఫలితంగా కొందరు కుల పెద్దలలో మరియు గ్రామ పెద్దలలో, వారిని ఆశ్రయించిన అనుచరులలో స్వార్థం, అసూయ, ఇతరుల అవసరాలను ఆసరాగా చేసుకొని తాము బాగుపడాలనే కోరిక అధికమైనది. తోటివారికి సహాయపడి సంతోషించాలనే మంచి గుణం నానాటికి నశిస్తుంది. ఇరుపక్షాలు వివాదపడినపుడు దానిద్వారా తాము లాభపడాలనే కోరిక పెరిగినది. స్వార్థం, స్వాతిశయం వలన మనిషి మనిషిని మనిషిగా ప్రేమించలేకపోవుచున్నాడు. శాస్త్రీయ సాంకేతిక పరిజ్ఞానం పెరుగుట వలన ఐహిక జీవనానికి ప్రాధాన్యం పెరుగుట, పట్టణాలు పెరుగుట, చలనచిత్రాలలోని పాశ్చాత్య నాగరికతల అనుకరణ, దీని ప్రభావం గ్రామాలలోకి విచక్షణా రహితంగా తరలి వెళ్లుట, లోపభూయిష్టమైన విద్యా విధానం, అక్షరాస్యులలో మానవతా విలువలపై సరియైన అవగాహన లేకపోవుట, గ్రామాలలో నిరక్షరాస్యులలో ఎక్కువగా ఉండుట మొదలగునవి గ్రామ జీవనంలో నైతిక ప్రమాణాలు పడిపోవుటకు ప్రధాన కారణాలు. ఈ స్థితి ఇదేవిధంగా కొనసాగినట్లయితే సహజ సిద్ధమైన, నిరాడంబర జీవనానికి ఆదర్శప్రాయమైన గ్రామాలు పట్టణాలవలెనే కలుషితమవుతాయి. ఈ లోపా

లను సవరించి ప్రాచీన భారతదేశపు నాగరికత పాశ్చాత్య నాగరికతలలోని ఆమోదయోగ్యం కాని విలువలకు తిలోదకాలిచ్చి, ఆయా నాగరికతలలోని ఉత్తమ విలువలను మన విద్యా లక్ష్యాలుగా స్వీకరించి ఆకృతిక [ఫార్మల్], అనాకృతిక [నాన్ ఫార్మల్] విద్యా విధానాలు, దృశ్య శ్రవణ విద్యా సాధనాల ద్వారా పట్టణ మరియు గ్రామీణ ప్రజలకు బోధించినట్లయితే ప్రజలు స్వార్థపరులైన కుల పెద్దలను రాజకీయ నాయకులను, వారి చెడు ప్రవర్తనను ప్రతిఘటిస్తారు. తద్వారా గ్రామీణ ఆర్థిక, సాంఘిక, రాజకీయ, న్యాయ వ్యవస్థలు గుణాత్మకంగా పనిచేసి గ్రామ ప్రజలకు ఉదాత్తమైన జీవనాన్ని అందిస్తాయి. మన జాతిపిత గాంధీజీ కలలుగన్న గ్రామసీమలే స్వర్గసీమలుగా పరిణమిస్తాయి.

## సంప్రదించిన గ్రంథములు :


1. ప్రమతానాధ బెనర్జీ, పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ ఇన్ ఏన్షియంట్ ఇండియా, ఇండియన్ రీప్రింట్స్ పబ్లిషింగ్ కంపెనీ ఢిల్లీ.
2. డా॥ ఏ. యస్. ఆల్టేకర్, స్టేట్ అండ్ గవర్నమెంట్ ఇన్ ఏన్షియంట్ ఇండియా, మోతీలాల్ బనార్సిదాస్.
3. ఆర్. వి. జత్‌హర్, ఎవొల్యూషన్ ఆఫ్ పంచాయతీరాజ్ ఇన్ ఇండియా, జే. యస్. యస్. ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఎకనమిక్ రిసెర్చ్, ధార్వార్-4.
4. స్వామి దయానంద సరస్వతి, సత్యార్థ ప్రకాశ [డా॥ చిరంజీవ భరద్వాజగారి ఇంగ్లీషు అనువాదము] ది ఆర్య ప్రతినిధి సభ పబ్లికేషన్, ఢిల్లీ.
5. పి. వి. కానే, హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర, వాల్యూమ్-3.


* రచయిత బాల్యమునుండి గత 25 సంవత్సరములుగా న్యాయ పంచాయతీలలో ప్రేక్షకుడుగా, అర్థిగా గడించిన అనుభవాన్ని పురస్కరించుకొని పంచాయతీల పరిగణన చేసినారు.

# నేను

శ్రీ యలమంచిలి శివాజీ

నేను
అలలా ఎగసిపడతాను
మించులా మిడిసిపడతాను—

స్నేహాల పూదోటలో
చెలిమి పూలు పూయిస్తాను—

ఆనందోదధిలో
సంతోషపు కెరటమై

హృదయాకాశంలో
వలపు తారకనై-

మనసు నందనంలో
ప్రేమపుష్పమై
పూస్తాను—నేను—

మానవతా కాసారంలో
మానవతా పద్మమై—

అశాంతి తిమిరంలో
జ్ఞానజ్యోతినై
శాంతిప్రదాతనై
వెలుగుతాను - నేను—



*

# కన్నీటి ప్రళయం

శ్రీ ఏలూచ్చూరి విజయరాఘవరావు

"ఆచంద్ర తారార్క మాది యంతులు లేని
అందాన్ని జుర్రుతూ, హర్షాన్ని పంచుకుని
అందరూ సమంగా అవనిలో బతక"మని

ఇంద్రధనుస్సుల సొగసు, ఇగురొత్తు సౌరభం
మధురసపు మధురిమం, మానవాళికి పంచి
మధుసూదనుడు నీకు "మనిషి" రూపిచ్చాడు!

"మనిషివే నీ"వన్న మాట మరిచేపోయి
మహిషాసురుడవైన మతిచెడిన నేస్తమా!!

మాతృభూమి గర్భగుడిని
మంటల్లో మసిజేస్తూ
మందాకిని అందాన్ని
కావేరీ 'కల' 'కల'నూ
మన మబ్బుల నీలిమనూ
మన కోయిల 'కుహు' 'కుహు'నూ
"బట్వారా" చేసేందుకు
బలిగొంటూవా ప్రజలను!

కండ్లూ కాళ్ళూ పొదిగిన
కాయా లెన్నైన్నైనా
పీనుగులయ్యేదాకా
పిండాల్లో నొప్పొకటే....

'నిగ' 'నిగ'లాడే దేహం
నీదైనా నాదైనా
కంకుడి వొడిలో పూడ్చే
కంకాళపు మన్నొకటే....

వేరు వేరు మతాలలో
వేల వేల పేర్లున్నా

రామ్ రహీములు కార్చే
రక్తధార రంగొకటే...

దూరంగా చిచ్చుబెట్టి
దుమారాలు రగిలించకు—
కాళ్ళకు నిప్పంటిస్తే
కళ్ళల్లో నీళ్ళొస్తయ్—
ఆ వేలుకు యీ వేలుకు
అరిచెయ్యే ఆధారం—
ఏ వేలును కోసేసినా
ఏడుస్తుంది వొళ్ళంతా—

మన మన తోబుట్టువులే
మనతోనే కలహిస్తూ
గుడిలోనూ బడిలోనూ
గుర్వీణి గర్భంలోనూ

గుండ్లు పేల్చి గుల్లచేసి
గూండాలై గూండ్రిస్తూ,
సతమతమయ్యే జనతను
హితమెరుగక హింసిస్తే
చీమైనా దోమైనా
చీకట్లో పురుగైనా
చిన్నైనా పెద్దైనా
చిల్లపెంకు ముక్కైనా
రాజైనా బంటైనా
రాటుపడే రైతైనా
రాత్రైనా పగలైనా
రాల్చిన ప్రతి కంటిబొట్టు
తటాకమై - తమాలమై

తఱుగుతుంది తల్లి కడుపు...
మఱుగుతుంది మన రక్తం...
మాతృశ్రీ మంద్రాటుం
మధు ద్విషుడి చక్రంలా—
ఘాతుక శక్తుల పాలిటి
పరిఘాతంలా - తృటిలో
ప్రచండమై, ప్రచక్రమై,
ఫాలుడి మూడో కన్నై—
పండిన పాపపు కొండల

గుండె చీల్చి పిప్పిజేసి
దుండగీళ్ళ గొంతు నొక్కి
పిండుతుంది హాలాహలం!
విషసర్పపు పండ్లు పీకి
విద్రోహాణ్ణగదొక్కి
కోలుకున్న ప్రజాబలం
కోరుతుంది శాంతిపథం;
మేలుకున్న ధరాతలం
తోలుతుంది శాంతిరథం!

# వేదన

## శ్రీ విశాల శ్రీకాంతశర్మ

అనంత ప్రకృతి సౌందర్యాన్ని సృష్టించి
రెండే రెండు చిన్న కళ్ళిచ్చినందుకు,
ఆర్తులను, బాధితులను అసంఖ్యాకులను పుట్టించి
ఆదుకునేందుకు కేవలం రెండే రెండు చేతులిచ్చినందుకు,
అగాధమైన దుఃఖాలను బాధలను కల్పించి
పంచుకోడానికి ఒకే ఒక ఇరుకైన మనసిచ్చినందుకు,
అనంత శతకోటి వర్షాల కాలప్రమాణంలో
కేవలం నూరంటే నూరేళ్ళ స్వల్ప ఆయుస్సు
ఇచ్చినందుకు,
'పైవాడి' లుబ్దత్వాన్ని ప్రశ్నించాలో
ప్రారబ్ధాన్ని నిందించాలో
తెలియని రోదన ఇది
ముగియని వేదన ఇది.

# ఆహ్వానం

## శ్రీ వల్లభాచార్య

నీలి జలదమ్ముల వెనుక నింగి నడుమ
నొఆసికొనుచు తటిల్లతలూరకే త
టాలున మెరసి యంతలో సోలిపోయి
యెచటనో జారిపోవు నా యెడదవోలె!

ఆ వినీల జలదమట్లె యావరించు
దుఃఖ తిమిరమ్ము నందు నందుల నులికి కొ
నుచు మెరపు లేవియో వెల్గు-నచటనె మాసి
పోవు-బాధాంబువాహమ్ము మూసివేయు!

ఎన్ని మెరపులటుల చేత నిరికినట్లె
చిక్కి జారిపోయినవొ నా జీర్ణహృదయ
భవన కుడ్యములగలట్టి పద్య చిత్ర
సంచయమున కాంచగలరు సాగిరండు!

# బతికేవున్నారు

కన్నడ మూలం :
**ఎస్. ఎల్. భైరప్ప**

తెలుగు అనువాదం :
**కాలిపు వీరభద్రుడు**

బడి గంట కొట్టేరు. పిల్లలంతా పరుగెత్తుకొంటూ బైటి కొచ్చారు. జారిపోతున్న చెడ్డీని మీదికి లాక్కొంటూ వెంకటేశన్నాడు - "నిజం, దేవుడిమీద ఒట్టు; మీ నాన్న చని పోయాడు."

"మీ నాన్నే చనిపోయాడ్రా, మా నాన్న దేవుడి దగ్గరి కెళ్ళారు." కోపంతో చంద్రం అన్నాడు.

"ఏమిట్రా అన్నావ్, మా నాన్న చనిపోయారా; క్షమాపణ కోరుకో."

"కోరను గాక కోరన్రా పందీ."

"క్షమాపణ కోరలేదు సరిగదా, పందీ అంటావా. మా నాన్నతో చెప్పి నిన్ను ఏం చేస్తానో చూడు.

"నేనూ మా నాన్నతో చెప్పి..." చంద్రం ఆగిపోయాడు. ఎన్నాళ్ళనుంచో నాన్న యింటికి రాలేదని చంద్రానికి తెలుసు. తను అ, ఆలు చదువుతున్నప్పుడే నాన్న దేవుడిదగ్గరి కెళ్ళి పోయాడు. ఇంకా రాలేదు. ఎప్పుడన్నా అడిగితే అమ్మ అనేది- -"వస్తారు బాబూ, అక్కడ పని పూర్తయాక వస్తారు." అని. అయితే అమ్మ మాటలు అబద్ధాలా? కాదు, అమ్మ అబద్ధమాడదు- చంద్రం అనుకున్నాడు.

"వెంకటేశూ, మరి నాతో వస్తావా; మా అమ్మనడుగు తాను, ఎవరి మాట నిజమో?"

"నన్నెందుకు పందీ అనాలి. నేను రాను."

"రావా?" అంటూ చంద్రం ఓ చిన్ని రాయి తీసి వెళ్ళి పోతున్న వెంకటేశుమీదికి విసిరేడు. అది వెంకటేశు తలకి తగిలింది. ఏడుస్తూ వెంకటేశు యింటికి పరుగెత్తాడు.

చంద్రం యింటికొచ్చిన వెంటనే "నాన్న చనిపోయారా అమ్మా, నిజంగానా?" అని తల్లి నడిగాడు.

చంద్రం తల్లి మాట్లాడలేదు. కన్నీళ్ళు దాచుకోవాలని వంటింట్లోకి వెళ్ళింది. ఆ తర్వాత వచ్చి — "నాన్నగారు చనిపోలేదు బాబూ, దేవుడిదగ్గరి కెళ్ళారు" అని చెప్పింది.

"మరి ఆ పందిగాడు వెంకటేశు చనిపోయారని అంటాడే?"

"బాబూ" అని గట్టిగా అరిచి, "ఇలాంటి మాటలు ఎప్పటి నుంచి నేర్చుకున్నావ్, తప్పు బాబూ" అని ఆ తల్లి నెమ్మదిగా చంద్రానికి చీవాట్లు పెడుతూంది. ఇంతలో వెంకటేశు తల్లి వచ్చింది. తన కొడుక్కి తగిలిన దెబ్బ చూపించింది.

"ఏరా, ఇలాంటి పెంకెతనం ఏమిటీ?" అంటూ చంద్రాన్ని కోప్పడిందతని తల్లి.

"మా నాన్న దేవుడిదగ్గరి కెళ్ళారని నేనంటే 'కాదు, మీ నాన్న చనిపోయార'ని ఎందుకంటాడు?" చంద్రం ఫిర్యాదు చేశాడు.

"బడికెళ్ళి చదువుకోకుండా యిలాంటి మాటలెందుకురా నీకు" అంటూ వెంకటేశు తల్లి చీవాట్లు పెట్టడంతో వెంకటేశక్కడ్నుంచి పారిపోయాడు. ఆ వెనక్కే చంద్రం కూడా పరుగెత్తేడు. ఇద్దరు తల్లులూ కొంతసేపు కష్టసుఖాలు వెళ్ళబోసుకున్నారు.

ఆ మర్నాడు బడికి వెళ్తూ వెంకటేశు చంద్రంతో అన్నాడు "మీ నాన్న చనిపోలేదట్రా చంద్రం; మా అమ్మ చెప్పింది. మీ నాన్నేమో దేవుడి వూరు వెళ్ళేరట్రా."

"సరేనా, నా మాట యిప్పటికన్నా నమ్ముతావా" చంద్రం మాటల్లో, పోగొట్టుకొన్న అమూల్యమైన వస్తువు తిరిగి దొరికినప్పుడు కలిగినంత ఆనందం వ్యక్తమయింది.

"దేవుడి దేశం ఎలా ఉంటుందో?" వెంకటేశన్నాడు.

"నీకు తెలీదా! మా అమ్మ చెప్పిందిలే. అక్కడ పెద్ద పెద్ద మేడలుంటాయట. మైసూరు రాజుగారి కోటకంటే కూడా పెద్దవట. దసరాకి మైసూరు కాంతివంతంగా మెరుస్తూందా, అంత కంటె అందంగా ఉంటుందట దేవుడి వూరు. అక్కడెప్పుడూ అగరుబత్తీల వాసనలు నిండి ఉంటాయట. ఎండ కాస్తున్నా చల్లగానే ఉంటుందట. మా అమ్మకిలాంటి సంగతులెన్నో తెలుసు."

"అలాంటి వూరు వెళ్ళారంటే మీ నాన్నదే అదృష్టం. మనం కూడా ఓసారి చూడ్డానికెళ్దామా?"

"తప్పురా, మనం అలా అనకూడదు!"

"ఏం?"

"నాకూ తెలీదు. వెళ్ళకూడదని మాత్రం మా అమ్మ అంటూంది."

* * *

బడినుంచి రోజులాగే వడికి వచ్చిన చంద్రానికి అన్నం పెట్టి వాళ్ళమ్మ స్కూలుకి వెళ్ళిపోయింది. చంద్రం బాలుర ఎలిమెంటరీ స్కూళ్ళో చదువుతున్నాడు. ఉదయం ఏడునుంచి పది, మధ్యాహ్నం రెండునుంచి అయిదువరకూ చంద్రానికి బడి ఉంటుంది. వాళ్ళమ్మ బాలికల హైస్కూళ్ళో టీచరు. ఆమె సాయంకాలం అయిదుకిగాని యింటికి రాదు. అవాళ చంద్రానికి ఏమీ తోచలేదు. రోజులాగే వెంకటేశు యింటికి ఆడుకోడానికి వెళ్ళేడు. అక్కడా ఉండాలనిపించలేదు. వాళ్ళమ్మదగ్గిరి కెళ్ళాడు, ఆమె క్లాసు చెబుతూంది. పాఠం ఆపి చంద్రం దగ్గిరికొచ్చింది.

"నాకేం తోచలేదు. ఇంటికొచ్చేయమ్మా" చంద్రం అన్నాడు.

"మరి స్కూలో!"

"నువ్వు జీతం తేవలసిన అవసరమేమిటమ్మా?"

"మనకి తిండీ, బట్టలు - యివన్నీ ఎలా వస్తాయి?"

"డబ్బు పంపమని నాన్నకి ఉత్తరం రాయమ్మా.... నువ్వు రాకుండా నేనిక్కడ్నుంచి కదల్నంతే."

"అలా అనకు బాబూ. నేను సాయంకాలం వచ్చినప్పుడు నీకు అన్ని విషయాలూ చెబుతాను. సరేనా. నువ్వు మంచి బాబువు గదా; వెళ్ళమ్మా. వెంకటేశుతో ఆడుకో. హెడ్మాష్టరు యిలా వస్తే బావుండదు." అంటూ ఆమె చంద్రాన్ని గేటు వరకూ సాగనంపింది.

అమ్మ క్లాసుకు వెళ్ళిపోయాక చంద్రానికి ఏడుపొచ్చింది. ఏడ్చేసేడు. 'ఇంటికి రాని చెబుతాను అమ్మ పని. బుగ్గమీద ఒకటి గట్టిగా వేస్తాను.' అనుకొని చంద్రం ఏడుపు దిగమింగేడు. వెంకటేశు యింటివైపు వెళ్ళసాగాడు.

సాయంకాలం అమ్మ వచ్చింది. కొట్టడం సంగతి మర్చిపోయాడు. రాత్రి నిద్రపోయేముందు - "నాన్నకి ఉత్తరం రాసావా అమ్మా" అని అడిగాడు తల్లిని.

"లేదు బాబూ."

"ఏం?"

"మనం రాసిన ఉత్తరాలు అక్కడికెళ్ళవు, అక్కడ్నుంచి మనకి రావు."

"నాన్న దగ్గరినుంచి ఉత్తరాలు వస్తున్నాయంటావు— అబద్ధాలా?"

"నాన్నగారుండే వూళ్ళో పోస్టాఫీసులుండవు."

"ఏమిటీ, దేవుడి వూళ్ళో పోస్టాఫీసులుండవా!? నువ్వు ఉత్తరం రాయమ్మా, నేను తీసుకెళ్ళిస్తాను నాన్నకి."

"అలా అనకూడదు బాబూ, యిక్కడి ఉత్తరాల్ని అక్కడికి తీసుకెళ్తే దేవుడొప్పుకోడు."

"అయితే, దేవుడు మంచివాడు కాదు."

"అయ్యో, అలా అనకూడదు బాబూ, లెంపలేసుకో." అంటూ చంద్రంచేత లెంపలు వేయించి అక్కున చేర్చుకుంది.

"నాన్న అక్కడికెందుకెళ్ళారమ్మా?"

"అగరుబత్తీలమ్మడానికి."

"నీవన్నీ అబద్ధాలేనమ్మా. అక్కడ యింతకంటె మంచి వాసన గల అగరుబత్తీ లున్నాయన్నావు. అలాంటప్పుడు నాన్న దగ్గర ఎవరు కొంటారమ్మా?"

ఇప్పుడేం చెప్పాలో ఆ తల్లికి అర్థం కాలేదు.

"అగరుబత్తీలు అమ్మేసిన తర్వాత నాన్న వచ్చేస్తారు గదమ్మా."

చంద్రాన్ని గుండెలకు హత్తుకొని ఆమె ఏడ్వసాగింది.

"ఏడుస్తావేమమ్మా?"

"ఇలాంటి ప్రశ్నలడగొద్దు బాబూ. నా కేడుపొస్తుంది. నిద్రపో, జోకొడతాను."

చంద్రం కళ్ళు మూసుకున్నాడు.

"అమ్మా, భయంగా ఉందమ్మా. దీపం పెద్దది చెయ్యమ్మా"

"అలాగే బాబూ. నిద్రపో." ఆమె దీపాన్ని పెద్దది చేసింది.

"అమ్మా, నాన్నగారు మనకెందుకు డబ్బు పంపరమ్మా. పంపితే హాయిగా నువ్వు ఇంటిదగ్గరే ఉండొచ్చు గదా హైస్కూలు కెళ్ళకుండా. నాన్న మనల్ని మర్చిపోయారా?"

"అయుండొచ్చు బాబూ."

"కాదమ్మా, నాన్నగారెంతో మంచివారమ్మా. నాన్న యిక్కడికి రాడానికి రైలు టిక్కట్టుకి డబ్బుల్లేవేమోనమ్మా, పంపించమ్మా."

"దేవుడి దేశంలో రైల్లుండవు బాబూ."

"నాన్నగారక్కడి కెలా వెళ్ళారు, విమానంలోనా?"

ఏమని చెబుతూందా తల్లి! ప్రతి సమాధానంకి ఓ ప్రశ్న పుడుతూనే ఉంది ఆ పసివాడి బుర్రలో. ఎన్నని కథలు అల్ల గలదు. ఆమె ఆలోచిస్తూంది - తండ్రి గురించి బాబు నన్ను గాక, యింకెవర్ని అడుగుతాడు. కాని తనెలా వాడ్ని సమాధానపర్చ గలదు? చంద్రం నిద్రపోయాడు.

* * *

చంద్రం ఒకటినుంచి రెండో తరగతికొస్తాడు, పెద్ద వాడవుతున్నాడు.

శివరాత్రి సందర్భంగా శివాలయంలో హరికథలు చెబు తున్నారు. ఆలయం చంద్రం యింటికి దగ్గర్లోనే ఉంది. అందుచేత చంద్రం రోజూ హరికథలు వినేవాడు. భక్త మార్కండేయ, సతీ సావిత్రి మొదలైన కథలు విన్నాడు.

చంద్రం రెండు మూడు రోజులవరకూ ఏదో ఆలోచిస్తూ మౌనంగా ఉన్నాడు. వాళ్ళమ్మని అడిగాడు - "దేవుడెలా ఉంటా డమ్మా" అని.

"ఏం బాబూ."

"నల్లని తాడు పట్టుకొని దున్నపోతుమీద వచ్చేవాడేనా?"

"అతను యమరాజు బాబూ."

"యముడు ఏమిటి చేస్తాడు?"

"మనుషుల ప్రాణాల్ని దేవుడి దగ్గరికి తీసుకెళ్తాడు." అమ్మ చెప్పిన మాటలు చంద్రం సరిగ్గా వినలేదు. పిడికిలి బిగించి ఏదో ఆలోచిస్తున్నాడు.

"నాన్న చనిపోయారా అమ్మా" విచారంగా అడిగేడు. చంద్రం తల్లి ఆశ్చర్యపోయింది కొడుకు యీ నిర్ణయానికొచ్చే డంటే సతీ సావిత్రి హరికథ అని ఆమెకర్థమయింది. ఎలాగో గొంతు పెగుల్చుకొని అంది —. "అలా అనకు బాబూ. మీ నాన్నగారు దేవుడి దగ్గరి కెళ్ళారు."

"అంటే దానర్థం చనిపోవడమే గదమ్మా."

ఆమెకు మాటలు కరువయ్యేయి - "నాకు నిద్రొస్తుంది బాబూ, నువ్వూ నిద్రపో. బాగా రాత్రయింది."

"నీకు నిద్రేం రాలేదు. నా మాటకి సమాధానం చెప్పమ్మా. అంతవరకూ నిన్ను నిద్రపోనివ్వను."

"నాకు తెలీదు బాబూ."

"అయితే నేను చెబుతాను విను. దేవుడి దగ్గరి కెళ్ళడ మంటే చనిపోవడమే. యముడు సత్యవంతుడి ప్రాణాలు తీసుకుపోయాడు. దానితో సత్యవంతుడు చనిపోయాడు."

చంద్రం తల్లి మాట్లాడలేదు. తన మాటల్లో నిజం ఉన్నందుకు చంద్రానికి ఆనందంగా ఉంది.

"ఏమమ్మా మాట్లాడవూ, అంతేగదూ." చంద్రం రెట్టించేడు. అవునని చెప్పాలనుకుంది కాని - "కాదు బాబూ, సత్యవంతుడు నిద్రపోయాడు. మెలకువ వచ్చాక గొడ్డలి పట్టు కొని యింటికొచ్చేసాడు గదా." అని అంది.

"అబద్ధం. సావిత్రి అతని ప్రాణాల్ని తీసుకొని వచ్చింది. అందుకే అతను లేచాడు. లేకపోతే సత్యవంతుడు చనిపోయాడు."

చంద్రం తల్లికి మాటలు కరువయ్యేయి.

"సావిత్రిలాగే నువ్వు కూడా నాన్నగారి ప్రాణాలు తేలేదేమమ్మా? నాన్న నీ వడిలో నిద్రపోలేదా?"

ఈ ప్రశ్న ఆమెను విలవిల్లాడేటట్టు చేసింది.

ఆనాడు ఆమె భర్త కూడా ఆస్పత్రిలో తన వడిలోనే చనిపోయాడు. అప్పుడు చంద్రం వెంకటేశు యింట్లో ఆడుకుంటు న్నాడు. ఆమె మాత్రం సావిత్రిలా తన భర్త ప్రాణాల్ని తీసుకు రాలేకపోయింది. సావిత్రికీ తనకీ పోలికా! చంద్రం తల్లి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

"ఏడుస్తున్నావేమమ్మా?"

"నాన్నగారి గురించి నన్నేమీ అడక్కు బాబూ, నాకేడు పొస్తుంది. మీ నాన్నగారు దేవుడి దగ్గరి కెళ్ళారు. చనిపోలేదు" చంద్రాన్ని గుండెలకు హత్తుకుంది.

"ఇంకెప్పుడూ అడగనమ్మా. ఊరుకో."

మర్నాడు స్కూలునుంచి తిరిగొచ్చాక అన్నం తిని వెంకటేశు యింటికి వెళ్ళకుండా శివాలయానికి వెళ్ళేడు చంద్రం. ఆ వేళప్పుడు ఆలయంలో ఎవ్వరూ ఉండరు. నిశ్శబ్దంగా ఉంటుందక్కడ.

చంద్రం కిటికీలోంచి లోపలికి చూశాడు. పెద్ద శివలింగం. విభూతి రేఖలతో పూలమాలలతో అలంకరించి ఉంది. లోపలున్న

# చర్మవ్యాధులకు




# అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్ఠంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు అదర్శమైన నివారిణి. నేడే కొనండి!

**అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004**

**Amrutanjan Limited** 

767-TG

దీపాల కాంతిలో శివలింగం మెరుస్తూంది. ఇంటినుంచి తెచ్చుకున్న అగ్గిపెట్టె, రెండు అగరుబత్తీలు జేబులోంచి తీసాడు. వంగిపోయిన అగరుబత్తీలను తిన్నగా చేసి వెలిగించాడు. కిటికీ దగ్గర పెట్టేడు. కళ్ళు మూసుకొని నమస్కరించేడు.

ఈ లింగాన్నే మార్కండేయుడు గట్టిగా పట్టుకొని యముడి బారినుండి రక్షించుకొన్నాడు. మా నాన్న కూడా లింగాన్ని గట్టిగా పట్టుకుంటే బతుకును. నాన్న మార్కండేయ కథ విన్నారో లేదో.

'నాన్న చనిపోలేదు, దేవుడి దగ్గరి కెళ్ళారని' అమ్మ చెబుతూంది. నాన్న అక్కడెన్ని రోజులుంటారో. అమ్మ హైస్కూలు కెళ్ళిపోతే నేనొక్కడ్నే ఉండాలి. నాకేం తోచదు. మనందరిలో ఉండే విషయాలు దేవుడికి తెలుస్తాయంటారు మరి నా మనస్సులోని సంగతి తెలుసుకొని నాన్నని పంపించవచ్చు గదా-చంద్రం తనని తాను మరిచిపోయి దేవుడ్నలా చూస్తూ ఉండిపోయాడు.

చంద్రానికేదో ఆలోచన వచ్చింది. ఆలయం లోపలికి వెళ్ళాడు. ఓ స్థంభానికి చేరబడి మఠం వేసుక్కూర్చున్నాడు. కళ్ళు మూసుకొని తపస్సు ప్రారంభించేడు. భక్తిపూర్వకంగా ఒక్క క్షణం తపస్సు చేసినా దేవుడు కనిపిస్తాడని హరికథలో విన్నాడు.

చంద్రం కళ్ళు మూసుకొని ఆలోచిస్తున్నాడు - నాలాంటి చిన్నవాళ్ళకి దేవుడు తొందరగానే ప్రత్యక్షమవుతాడు. నాన్నని పంపమని అడుగుతాను. దేవుడు నాన్నని నాతో పంపుతాడు ఇంటికి కూడా వెళ్ళకుండా నాన్నా నేనూ అమ్మ దగ్గరికి స్కూలుకి వెళ్తాం. ఇదుగోనమ్మా నాన్నని తీసుకొచ్చానంటాను. అమ్మ ఆనందంతో పొంగిపోతూంది ...కాని దేవుడెలా ఉంటాడో నాకు తెలీదు. శంకరుడికి నుదుటిమీద మరో కన్ను ఉందని హరిదాసు చెప్పేడు. తలమీద సిగలోంచి గంగ ప్రవహిస్తుందట. చేతిలో త్రిశూలం, పక్కనే పార్వతీదేవి. పార్వతీదేవి అమ్మలా ఉంటుందా. చెవుల్లో దుద్దులు. చేతులికి కంకణాలు. నుదుట కుంకుమబొట్టు....అమ్మ బొట్టు పెట్టుకోవడం ఎందుకు మానేసిందో!? ఈ ప్రశ్న చంద్రం ధ్యానాన్ని భంగం చేసింది

నాన్న చనిపోయారా? చనిపోలేదని అమ్మ అంటూందే. మరెందుకు బొట్టు పెట్టుకోదు? కొనడానికి డబ్బుల్లేవా? జీతం తెచ్చుకుంటూంది, కుంకం కొనుక్కోలేదా? నాన్న చనిపోయుండొచ్చా?

సరే, మొదట దేవుడు ప్రత్యక్షంగానీ. చనిపోయినవాళ్ళని బతికించే మహిమ అతనికుంది గదా. నాన్నని తీసుకెళ్ళకుండా యిక్కడ్నుంచి కదలను — చంద్రం మరింత గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

దేవుడా. రా మా నాన్నని తీసుకురా. ఇంత ఆలస్యమా అమ్మకి జీతం రాగానే నీకు అభిషేకం చేస్తాం. ఇప్పుడు నేను భోజనం చేసేసాననా? భక్తితో మొరపెట్టుకుంటే క్షణంలో వస్తావంటారే రాకపోయావో నా మీద వొట్టే....

ఇంతలో ఎవరో వచ్చినట్టు అడుగుల శబ్దం వచ్చింది— ఆ దేవుడే వచ్చాడు. 'లే బాబూ, నేను వచ్చాను' అని అన్నంత వరకూ కళ్ళు విప్పను అని చంద్రం అనుకున్నాడు.

ఇంతలో ఆలయమంతా ప్రతిధ్వనిస్తూ ఓ కేక వినిపించింది — "చంద్రం, ఇక్కడేం జేస్తున్నావు, రారా ఆడుకుందాం" అంటూ వెంకటేశు పిలిచిన పిలుపది.

"పోరా పందీ, ఆలయంలో కేకలేమిటి?" చంద్రం కోపంతో విసుక్కున్నాడు.

"నువ్వే పందివిరా" అంటూ వెంకటేశు చంద్రం దగ్గరికి రాబోతున్నాడు వెంటనే చంద్రం అక్కడే ఉన్న చిన్నదీపం సెమ్మెను వెంకటేశుమీదికి జోరుగా విసిరేడు. దీపం సెమ్మె వెంకటేశు భుజానికి గుచ్చుకొని రక్తం చిమ్మింది. వెంకటేశు ఏడుస్తూ పారిపోయాడు.

చంద్రం మళ్ళీ ధ్యానంలో మునిగిపోయాడు. కొంచెం సేపయాక మళ్ళీ ఏదో శబ్దం.

"ఏరా చంద్రం, యిక్కడ కూర్చొన్నావేమిటి? వెంకటేశు నెందుకు కొట్టావ్?" అంటూ చంద్రం తల్లి కోపంతో ఊగిపోతూ వచ్చింది. చంద్రం కళ్ళు తెరిచాడు. వెంకటేశు అతని తల్లి కూడా ఎదురుగుండా కనిపించారు.

"ఏం జేస్తున్నావురా?" అంటూ చంద్రాన్ని కొట్టాలని అతని తల్లి చెయ్యెత్తింది.

"తపస్సు చేస్తున్నానమ్మా."

"తపస్సేమిటి!?"

"నాన్నని మనింటికి తొందరగా పంపమని దేవుడికోసం తపస్సు చేస్తున్నానమ్మా. వెంకటేశు వచ్చి నా తపస్సు పాడు చేసేడు."

చంద్రాన్ని కొట్టాలని ఎత్తిన ఆమె చెయ్యి కిందికి దిగిపోయింది. కొంచెంసేపు ఆమెకు మాటలు పెగల్లేదు. తర్వాత ఏడుస్తూ అంది - "తపస్సు చేస్తే నాన్న వస్తారా బాబూ?"

"హరిదాసు చెప్పేరు గదమ్మా."

"పద వెంకటేశూ, నీ గాయానికి మందు వేయిస్తాను" అంటూ చంద్రం తల్లి వెంకటేశుని తనవెంట తీసుకుపోయింది.

కొంతసేపయాక చంద్రం కూడా యింటిదారి పట్టాడు ఆ సాయంకాలం గాని రాత్రికి గాని చంద్రంతో తల్లి మాట్లాడలేదు.

* * *

మర్నాడుదయం చంద్రం స్కూలునుంచి వచ్చేడు. వాడికి అన్నంపెట్టి ఆమె హైస్కూలుకి వెళ్ళిపోయింది. చంద్రంతో అప్పుడు కూడా మాట్లాడలేదు. చంద్రం రోజులాగే వెంకటేశు యింటికి వెళ్ళలేదు. దేవాలయానికి వెళ్ళేడు - తపస్సు చెయ్యడానికి. 'ఇక్కడ నేనొక్కడ్నే, నాకేమన్నా అయితే' అని భయపడిపోయాడు. తర్వాత హైస్కూలు గోడపక్కని చెట్టు కింద కొంతసేపు ఒక్కడే ఆడుకున్నాడు. రెండు గంటలు కావస్తున్నా పలకా పుస్తకాలు తనదగ్గర లేనందున స్కూలు కెళ్ళడం మానేసాడు.

సాయంకాలం తల్లి చంద్రంతో ఏమీ మాట్లాడలేదు. ఆ తర్వాత యిద్దరూ రాత్రి భోజనాలకి కూర్చున్నారు. కొంచెంసేపు ఎవరూ మాట్లాడలేదు. తల్లి ధోరణి చంద్రానికి విసుగ్గాను కోపంగాను ఉంది.

"మాట్లాడవేమమ్మా నాతో" చంద్రం తల్లితో అన్నాడు.

ఆమె ఏదో ఆలోచిస్తూంది. సమాధానం యివ్వలేదు.

"మాట్లాడతావా, ఒకటివ్వాలా?" - అంటూ చంద్రం తల్లిమీదికి చెయ్యెత్తాడు. కాని అంతలోనే చంద్రం కోపం కన్నీరుగా మారిపోయింది.

"అమ్మా! నాతో మాట్లాడవేమమ్మా." ఏడ్చేసాడు.

"నీతో మాట్లాడక ఎవరితో మాట్లాడతాను బాబూ" ఆ తల్లి కొడుకుని అక్కున చేర్చుకుంది. దాంతో చంద్రానికి ఎంతో బలం వచ్చినట్టయింది.

"తపస్సు చేస్తే నాన్న వస్తారని ఎవరు చెప్పారు బాబూ"

"హరిదాసు చెప్పేరు గదమ్మా దేవుడు ప్రత్యక్షమై మన కోరికలు తీరుస్తాడని-అందుకే అతని దగ్గరున్న నాన్నని తొందరగా పంపమని తపస్సు చేస్తున్నానమ్మా."

"అక్కడి కెళ్ళినవాళ్ళు తిరిగి రారు బాబూ."

"తపస్సు చేసినా రారా!?"

"మా బాబు చాలా మంచివాడు. నా మాట వింటాడు ఎప్పుడూ ఆలయానికి ఒక్కడివీ వెళ్ళకేం."

"నాకేం భయమా?"

"నువ్వు పిరికివాడివి కాదు బాబూ. కాని నాకే భయం ఎవ్వరితోనూ వెళ్ళకు."

"ఏం?"

"కారణం అడగొద్దు. నామీద వొట్టెయ్ వెళ్ళనని"

ఆలయానికి వెళ్ళనని వొట్టు పెట్టేడు తల్లి చేతిలో చెయి వేసి.

మర్నాడు చంద్రం స్కూలుకి బయలుదేరేడు. దారిలో రోడ్డంచున చచ్చిన కుక్క పడి ఉంది. చాలామంది పిల్లలతో బాటు చంద్రం కూడా చూసాడు. ఏవేవో ఆలోచనల్తో స్కూలు వెళ్ళేడు. ఆ తర్వాత రెండు రోజులవరకూ ఎన్నో ఆలోచనలు అతని బుర్రలోకి వస్తున్నాయి, పోతున్నాయి.

"ఏమిటాలోచిస్తున్నావు బాబూ." తల్లి అడిగింది.

"ఇన్నాళ్ళయినా రాలేదంటే నాన్న నిజంగానే చనిపోయరమ్మా. మరిచిపోయారనుకున్నా యిన్నాళ్ళూ. అంతేగదమ్మా."

ఆ తల్లిమీద పిడుగు పడినట్టయింది. నాన్న చనిపోయారని అప్పుడే చెప్పకపోవడంలోను, దేవుడి దగ్గరకెళ్ళారని మభ్య పెట్టడంలోనూ ఎంత పొరపాటుందో ఆమెకు యిప్పుడు తెలిసి వస్తూంది. ఆనాడే నిజం చెప్పేస్తే రెండు రోజులేడ్చి ఆ తర్వాత తండ్రిని మర్చిపోను. ఇప్పుడిలాగ నాన్నను తీసుకొస్తానని దేవాలయంలో తపస్సు చెయ్యకపోను. ఆనాడే నిజం చెప్పేస్తే ఎంత బావుండును....పోనీ యిప్పుడైనా నిజం చెప్పేయాలి. తను చెప్పినా చెప్పకపోయినా చంద్రానికెలాగైనా తెలిసిపోతుంది. అంచేత యిప్పుడే చెప్పేయాలనే నిశ్చయానికొచ్చిందామె.

కొడుకు చేతుల్ని తన మెడలో వేసుకొని —— "అవును బాబూ, నేనిన్నాళ్ళూ నీతో అబద్ధం చెప్పేను మీ నాన్నగారు దేవుడి దగ్గరి కెళ్ళలేదు. ఆయన చనిపోయారు బాబూ." అంటూ గుక్క తిరక్కుండా ఒక్కసారే చెప్పేసింది.

"ఇన్నాళ్ళూ అబద్ధమెందుకు చెప్పావమ్మా."

"నాది తప్పే బాబూ."

చంద్రం మౌనం వహించేడు. ఆలోచిస్తున్నాడు—చనిపోవడమంటే? ఆ కుక్క చచ్చిపోయింది, అలాగేనా? అయితే నాన్న కూడా....చంద్రానికి ఏడుపు పెళ్ళుబికింది. అమ్మ గుండెల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగేడు.

"ఏడవకు బాబూ. పుట్టిన ప్రతి ప్రాణీ ఏదోరోజున చనిపోక తప్పదు." తల్లి చంద్రం వీపు నిమురుతూ అంది. అలాగే రెండు మూడు నిమిషాలు ఏడ్చి ఆ తర్వాత కళ్ళు తుడుచుకున్నాడు. ఏదో నిశ్చయించుకొన్నవాడిలా ముఖం గంభీరంగా పెట్టేడు.

"నాన్న చనిపోయారని అనకమ్మా."

"లేదు బాబూ, ఆయన నిజంగానే చనిపోయారు; మీ నాన్న చనిపోయారు."

చంద్రానికి మళ్ళీ ఏడుపొచ్చింది. -"అలా అనకమ్మా. నాన్న చనిపోలేదు; దేవుడి దగ్గర కెళ్ళారమ్మా." అంటూ ఏడ్వసాగేడు.

కొడుకు ధోరణి ఆమె కంతుచిక్కలేదు. ఆతని ముఖం అలా చూస్తూ ఉండిపోయిందామె. కాదంటే ఏడుస్తాడనే బెంగ ఆ తల్లికిప్పుడు పట్టుకొంది.

"నా మాట నిజమే గదమ్మా; ఔనని చెప్పమ్మా" అంటూ చంద్రం తల్లిని కుదిపేస్తున్నాడు.

సరిగ్గా అప్పుడే హరిదాసు చెప్పిన మాటలు ఆమెకు గుర్తొచ్చాయి - భర్తే కొడుకు రూపంలో భార్య గర్భంలోంచి జన్మిస్తాడట. అంటే చంద్రం రూపంలో ఆయన తనదగ్గరే ఉన్నారన్న మాట. అవును, ఆయన బతికే ఉన్నారు చనిపోలేదు.

తనని కుదిపేస్తున్న కొడుకుతో — "ఔను బాబూ, మీ నాన్నగారు చనిపోలేదు; బతికే ఉన్నారు." అంటూ కన్నీళ్ళతో కొడుకు చంద్రాన్ని గట్టిగా కౌగిలించుకుందామె.

---

# ఆదేశించు మిత్రమా!

## శ్రీ శింగిసెట్టి సంజీవరావు

చెట్టు శుష్కిస్తే కట్టె అవుతుంది
మనిషి మరణిస్తే కట్టె మిగులుతుంది
ఓ కట్టె దగ్ధమై మనిషిని బ్రతికిస్తుంది
మరో కట్టె కాలి చెట్టుకి చావు తెస్తుంది
నా అహం జ్వలిస్తే నీకు విషం పెడతాను
నేను అసూయాపరుడ్ని
నా అణువణువు వెలగించి
ప్రాణం పోసే ప్రాణ వాయువు
ఉదజని రగిల్చి నీరు పోస్తుంది
కంఠదాహం తీరుస్తుంది
అంగారకంతో కలిసి కిరణ సంయోగంతో
చెట్టుకి కాయ కాయిస్తుంది
అది ఆహార్యం అవుతుంది

ప్రాణవాయువు నేను కానా?
నేను నీరాజనమై స్వాగతి ఇవ్వనా?
ప్రాణోదకం ధారపోయనా?
మనుషుల చీకటి గహ్వరంలో దూరి
రశ్మిరేఖ మొలకెత్తించనా?
బ్రతుకులు ఫలింపజేయనా?
నువ్వు ఆదేశించు మిత్రమా!
నీ ధర్మమా అని తప్పు దిద్దుకుంటాను
ఎర్రని అసూయ జ్వాల నాలో ఆరిపి
పచ్చని ప్రాణదీప్తి నీలో పెడతాను
ఆ వెచ్చని కాంత్యుజ్జ్వలంలో నన్ను చూచి
ఈ గుప్త పరితప్త హృదయాన్ని తెలుసుకోగలవు
నన్ను ఆదేశించు మిత్రమా!

రచన :
కీ. శే. కే. యస్. కోదండరామయ్య

సేకరణ, సమర్పణ :
శ్రీ కారుపల్లి విశ్వనాథం

# విజయనగర సామ్రాజ్య మెంతకాలము జీవించియుండెను?

క్రీ.శ. పదునాల్గవ శతాబ్దము తొలి భాగమున ఢిల్లీ సుల్తానులు పెక్కు తడవలు దక్షిణ దేశముపై గావించిన భయంకరమైన దండయాత్రల కెదురొడ్డి నిలువలేక, ఆ సమయమున ఈ దేశములో వేర్వేరు ప్రాంతములలో పాలించుచుండిన, హైందవ రాజ్యాలైన యాదవ, హొయసల, కాకతీయ పాండ్యాది రాజ్యము లొక్కటొక్కటిగా పరాజయముపాలై క్రమ క్రమముగా జితికిపోయినవి. ఈ విషయము నొక చరిత్రకారుడిట్లు విశదపరచియున్నారు. "ఇట్ అల్టిమేట్లీ బికేమ్ సబ్జెక్టు టు ది ముహమ్మడన్ యోన్. అపర్చునిటీస్ ఫర్ ప్లండర్ వేర్ ఫ్రీలీ అవైల్డ్ బై ది సుల్తాన్స్ ఆఫ్ డెల్హీ...."

మహమ్మదీయులు గావించిన దుర్మార్గములిట్లు వర్ణింపబడియున్నది. "ది కాంపైన్స్ ఆఫ్ మాలికాఫర్ అండ్ అల్లాఉద్దీన్ లైడ్ వేస్టరిచ్ ట్రాక్ట్స్ ఆఫ్ సదరన్ ఇండియా అప్ టు ది కీప్ - - - డెత్ అండ్ డిజల్యూషన్ అండ్ ప్లండర్ అట్ ది కాపిటల్స్, డిస్ట్రిక్షన్ ఆఫ్ టెంపల్స్; కన్వెర్షన్ ఆఫ్ ది ప్రాఫట్ ఫాలోడ్ ఇంది వేక్...."

[వైడ్. ఫౌండర్స్ ఆఫ్ ది విజయనగర్ ఎంపయర్. పుట 330]

తరతరాలుగా ప్రజాహిత చింతకులై, హిందూమత సంరక్షకులై, సాహిత్య పోషకులై యుండిన హిందూ రాజుల పరిపాలనా కాలములో సుసంపన్నములై, కళకళ లాడుచుండిన పై రాజ్యములు కఠినులు, భిన్నమతస్థులు అయిన విజేతల పాలైన తరువాత, దిక్కులేనివై, పంటలు నశించగా, కరువు కాటకాలకు నెలవులై పాడుపడినవి. ఈ దుర్భర పరిస్థితిని విదేశీయ చరిత్రకారుడగు, డి. బి. గ్రిబ్లేగారిట్లు వర్ణించియున్నారు. "దెరీజ్ త్రూ అవుట్ ది హిస్టరీ ఆఫ్ ది స్ట్రిగల్ బిట్వీన్ ది మహమ్మడన్స్ అండ్ ది హిందూస్. వన్ రిమార్కబుల్ ఫీచర్ అండర్ మహమ్మడన్ రూల్ ఇట్ వుడ్ సీమ్ డెట్ దేర్ వాజ్ లిటిల్ ఆర్ నో నాచురల్ ప్రొడక్షన్ అండ్ నో డెవలప్‌మెంట్ ఆఫ్ ది కంట్రీస్ రిసోర్సెస్. అండర్ హిందూ ప్రిన్సెస్ ఆన్ ది కాంట్రరీ, యాజ్ లాంగ్ యాజ్ దె వెర్ లెఫ్ట్ అన్‌డిస్టర్బ్డు అటెన్షన్ వాజ్ పైడ్ టు అగ్రికల్చర్ అండ్ ఇర్రిగేషన్ వర్క్స్ అండ్ ఎస్పెషలీ టు మింగ్ ఇండస్టరీస్. ది కాన్సీక్వెన్స్ వాజ్ డెట్ ది హిందూ కింగ్‌డమ్స్ బికేమ్ రిచ్ అండ్ ప్రాస్పరస్, బట్ యాజ్ సూన్ యాజ్ దే వేర్ కాంక్వర్డ్ అండ్ అనెక్స్డ్ బై ది మహమ్మడన్స్ ఇండస్ట్రీస్ వేర్ అలోడ్ టు లాంగ్విష్. నో మోర్ స్ట్రైకింగ్ ఇన్‌స్టన్స్ ఆఫ్ దిస్ ఈజ్ సౌండ్ దాన్ ఇన్ ది డెక్కన్...."

[వైడ్. ఎ హిస్టరీ ఆఫ్ ది డక్కన్. పార్ట్ 2. పుట. 26]

విమతుక్తుల దారుణమైన పరిపాలనములో హిందూ ధర్మము, హిందూమతము ధ్వంసము కాజొచ్చినది. సనాతనమైన హిందూమతము దక్షిణ భారతములో రూపుమాసిపోవు దురదృష్ట పరిస్థితి యేర్పడినది. అట్టి మహా క్లిష్ట సమయములో మహాతపస్వి, విద్యానిధి, దీర్ఘదర్శి సమయజ్ఞుడు అగు శ్రీ విద్యారణ్యస్వామివారి అమోఘమైన సంకల్ప బలముతో, ఆశీర్వాదముతో, తోడ్పాటుతో, మహాశూరులగు బుక్కరాయాది సోదర పంచకము, శా.శ. **1258** ధాతృ సంవత్సర వైశాఖ శుక్ల సప్తమి బుధవారమునాడు (క్రీ.శ. **1336**) విజయనగర సామ్రాజ్యము రంగత్తుంగతరంగ రంజితమైన తుంగభద్రా తరంగిణీ తీరమున అభేద్యమైన స్థలమున ఉదయించింది.

ఇది జరిగిన పదేళ్ళకావల బహమనీ రాజ్యమేర్పడింది. "హరిహరరాయని కాలమందే విజయనగరమునకు గర్భశత్రువైన యొక తురుష్కరాజ్య ముదయించెను.

[చూ. మహమ్మదీయ మహాయుగము. పు. 344]

**విజయనగర సామ్రాజ్యమును పాలించిన రాజవంశములు :**

విజయనగర సామ్రాజ్యమును నాలుగు రాజవంశములవారు పాలించినారు. వారు (1) సంగమ వంశము (2) సాళువ వంశము (3) తుళువ వంశము (4) ఆరవీటి వంశము.

వీరిలో సంగమవంశపు రాజులు క్రీ.శ. 1336 నుండి 1485 వరకు సుమారు 150 సంవత్సరములపాటు పాలించినారు. పిదప సాళువ వంశపు నరపాలురు 1486నుండి 1505 వరకు నేలినారు. వీరి యనంతరము తుళువ వంశమువారు 1505 నుండి 1571 వరకు అనగా దాదాపు డెబ్బది సంవత్సరములు పాలించినారు. వీరికి పిమ్మట ఆరవీటి చక్రవర్తులు రాజ్యాధికారమును వహించి, ఆ సామ్రాజ్యము సంపూర్ణముగా జీతికి, అంతమొందు వరకు పాలించారు. కాని, ఈ చక్రవర్తుల పరిపాలనా కాలము యొక్క తుది సంవత్సర మింకను తేలలేదు. ఈ విషయమై చరిత్రకారులలో భిన్నాభిప్రాయములున్నవి.

ఆరవీటి రాజైన ఆరవ శ్రీరంగరాయల మరణముతో వారి పరిపాలన మంతమొందినదని కొందరు చరిత్రకారులు చెప్పియున్నారు. ఆ చక్రవర్తి క్రీ.శ. 1675వ సంవత్సరమున మరణించెననియు, అంతటితో నాసామ్రాజ్య మస్తమించెననియు, కీ.శే. నీలకంఠశాస్త్రిగారు వ్రాసియున్నారు. "వెన్, లైక్ జింజీ ఎ లిట్ల్ బిఫోర్ సబ్‌మిటెడ్ టు బిజాపూర్ ఇన్ 1649 శ్రీరంగా రిపేర్డ్ టు మైసూర్, వేర్ హి కెప్ట్ హిస్ కోర్ట్ విత్ ది ఎయిడ్ ఆఫ్ కెలడీ చీఫ్స్, డ్రీమింగ్ ఆఫ్ ది రికాన్‌క్వెస్ట్ ఆఫ్ వెల్లూర్ అంటిల్ డెత్ కేమ్ టు హిమ్ ఏజ్ ఎ రిలీఫ్, సమ్ టైమ్ అబౌట్ 1675.... దస్ నెవర్తెలెస్ ఎండెడ్ ది కర్నాటక-విజయనగర ఎంపయర్, మోర్ దాన్ త్రీ సెంచురీస్ ఆఫ్టర్ ఇట్స్ ఫౌండేషన్...."

[వైడ్. హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా, పుట. 293]

కాని, మైసూరు చరిత్రకారుడగు కీ.శే. శ్రీ హయవదన రావుగారు ఆ సామ్రాజ్యము క్రీ.శ. 1776 వరకు, అనగా సుమారు 440 సంవత్సరాలు జీవించియుండెననియు, వేర్వేరు వంశములకు చెందిన రాజులు దాదాపు ముప్పదిమంది పాలించిరనియు వ్రాసియున్నారు. "ద స్టోరీ ఆఫ్ విజయనగర్ ఎంపయర్ మే బి సెడ్ టు ఎండ్ హియర్. దిస్ ఎంపయర్ హాడ్ ఎండ్యూర్డ్ ఇన్ వన్ ఫార్మ్ ఆర్ అనెదర్ ఫార్ నియర్లీ 440 ఇయర్స్ (1336-1776 ఎ.డి.) అండర్ సమ్ థర్టీ ప్రిన్సస్, క్లైమింగ్ డీసెంట్ ఫ్రమ్ డిఫరెంట్ డైనాస్టీస్, మోర్ ఆర్ లెస్ కనెక్టెడ్ విత్ ఈచ్ అదర్...."

[వైడ్. మైసూర్ గెజటీర్. వాల్యూం 2, పార్ట్ 3. పుట. 2420]

అయినను, ఈ విషయమును గురించి, సుప్రసిద్ధ శాసన పరిశోధకులైన కీ.శే. శ్రీ వి. కృష్ణమాచార్యులు, విజయనగర సామ్రాజ్యము క్రీ.శ. 1790 వరకు గూడ జీవించియుండెననియు, ప్రజలా చక్రవర్తుల అధికారమును, అంగీకరించి గౌరవించుచుండిరనియు వ్రాసియున్నారు. "ది ప్రాక్టికల్ సావరీనిటీ ఆఫ్ ది విజయనగర పాస్డ్ అవే అబౌట్ ది మిడ్ల్ ఆఫ్ ది సెవన్టీన్త్ సెంచురీ, ఎ సెంటిమెంటల్ రికగ్నిషన్ ఆఫ్ ఇట్ సర్వైవ్డ్ ఈవెన్ యాజ్ లేట్ యాజ్ 1790....దిస్ ఈజ్ ఎ గుడ్ టెస్టిమోనీ టు ఇట్స్ ఒరిజినల్ పవర్, లేటర్ గ్రేట్‌నెస్ అండ్ ప్రాస్పరిటీ టు సే రెస్పెక్ట్ అకార్డెడ్‌టు ఇట్, ఈవెన్ ఇన్ ది డేస్ ఆఫ్ ఇట్స్ ఇన్‌ఫార్మిటీ అండ్ డిసీస్...."

[వైడ్. ఇండియన్ ఆంటిక్వరీ. వాల్యూ. 25-1925 పు. 12]

కాని, శ్రీ సి. హయవదనరావుగారు మరల నొకచోట నీ విషయమును గురించి, చర్చించి క్రీ.శ. 1675కు తర్వాత సయిత మా రాజ్యము జీవించియుండెననియు, ఆరవ శ్రీరంగ రాయలకు పిదప ఏడవ శ్రీరంగరాయలు క్రీ.శ. 1759 వరకు పాలించెననియు, ఆ పిదప పాలించినవారిని గురించిన మరికొన్ని వివరములు కీ.శే. మెకంజీ దొరగారి వ్రాతప్రతులనుండి తెలియుచున్నదనియు, ఆ వివరములనుబట్టి ఏడవ శ్రీరంగరాయలకు పిమ్మట తిరుమల రాయలను నతడు క్రీ.శ. 1801వ సంవత్సరములో గూడ పాలించుచుండినటుల తెలియుచున్నదనియు, ఈ కడపటి రాజులు ఆనెగొంది నుండి పాలించుచుండిరనియు తెలియుచున్నది.

"శ్రీరంగ 7, అకార్డింగ్లీ నోన్ టు ఇన్‌స్క్రిప్షన్స్.... యాజ్ వి డునాట్ హియర్ ఎనీమోర్ ఆఫ్ హిమ్ ఆఫ్టర్ దెట్ డేట్ హి ప్రాబబులీ డైడ్ అబౌట్ దెట్ ఇయర్స్ విల్ హిమ్ ది డైనాస్టీ యాజ్ సబ్‌వర్సివలీ క్లోస్డ్ అకార్డింగ్ టు మెకంజీ మాస్, హౌ ఎవర్, తిరుమలరాయ, హూ సక్సీడెడ్ ఇన్ 1756, రామరాయలు, (ఐడెంటికల్ విత్ కోదండరామ 2 ఆర్ రామ రాజ 6) వాజ్ స్టిల్ రూలింగ్ ఇన్ 1801 అట్ ఆనెగొంది...."

[వైడ్. మైసూర్ గెజెటీర్ వాల్యూం 2 పార్ట్ 3. పుట. 2420]

మెకంజీ దొరగారు చెప్పియుండు పై విషయమును మరియొక మంచి ఆధారము బలపరచుచున్నది. ఈ తిరుమలరాయలు క్రీ.శ. 1776వ సంవత్సరమున కూడ ఆనెగొంది రాజ్యమును పాలించుచుండెననియు, ఆ సంవత్సరమున మైసూరు పాలకుడైన హైదరాలి యాతనిని జయించి, యాతనినుండి కప్పము గొనెననియు మరియు నాతడు విజయనగర వంశీయుడనియు తెలియు

చున్నది. ఈ వివరము లిట్లున్నవి. "హి (హైదర్) ఇన్ జులై **1976,** క్రాస్డ్ తుంగభద్రా ఇన్ బాస్కెట్ బోట్స్ అట్ ఆనెగొంది. ది చీఫ్ ఆఫ్ ఆనెగొంది, తిమ్‌రాజ్ (తిరుమలరాయ) ఎ డిస్సెండెంట్ ఆఫ్ ది ఇల్లస్ట్రియస్ కింగ్స్ ఆఫ్ విజయ నగర్, సబ్మిటెడ్ టు హైదర్ విత్ యాన్ ఆఫర్ ఆఫ్ "ఎ లాక్ ఆఫ్ రూపీస్) హైదర్ ఇన్ వ్యూ ఆఫ్ "ది హై ర్యాంక్ ఆఫ్ ది ఆన్సెస్టర్స్ ఆఫ్ తిమ్మరాజ్ అండ్ దేర్ ఫార్మర్ గ్రేట్‌నెస్." "ది కంట్రీ ఆఫ్ ది టూ కార్నాటిక్స్, అండ్ ఈవన్ ది దక్ఖమ్ ఫ్రమ్ ది షోర్ట్స్ ఆఫ్ మలబార్ టు ది బ్యాంక్స్ ఆఫ్ నర్బుద్దా బీయింగ్ సబ్జెక్ట్ టు దేర్ అథారిటీ ఇన్ ఫార్మర్ టైమ్స్"— ఎక్సుక్యూజ్‌డ్ హిమ్ ది పేమెంట్ ఆఫ్ హిస్ పైష్‌కుష్, అండ్ సెంట్ హిమ్ హానరరీ డ్రెస్, కన్ఫర్మింగ్ హిమ్ ఇన్ ఆల్ హిస్ పొషెషన్స్...."

[వైడ్. హిస్టరీ ఆఫ్ మైసూర్. వాల్యూం 3. పు. 228]

పై పంక్తులనుండి తిరుమల రాయలను గురించి మరి కొన్ని విషయములు గూడ తెలియుచున్నవి, ఈ తిరుమల రాయలు ప్రఖ్యాతి గాంచియుండిన రాజవంశమునకు జెందినవాడనియు, ఆతని పూర్వీకుల రాజ్యము చాలా విస్తారముగ నుండెననియు దెలిసినందున ఆ సుల్తాను, తిరుమలరాయలను గౌరవించి, అత డివ్వవలసిన కప్పమును మాపు చేసెననియు, అంతేకాక ఆతని వశమందుండిన ప్రాంతముల నాతనికే స్థిర మొనర్చెననియు దెలియుచున్నది. దీనినుండి తిరుమలరాయలు మంచి చాతుర్యము, మరియు లౌకిక పరిజ్ఞానము గలవాడనియు, హైదరాలి వంటివానిని గూడ తన కనుకూలునిగ జేసుకొని తన రాజ్యమును రక్షించుకొనె ననియు తెలియుచున్నది. క్రీ.శ. **1776**కు దర్వాత తిరుమల రాయలెంత కాలము పాలించెనో తెలిసికొనవలసి యున్నది.

హైదరాలి క్రీ.శ. **1782**వ సంవత్సరమున మరణించెను. ఆవల నాతని కుమారుడు టిప్పు సుల్తాను మైసూరు రాజ్యమునకు వచ్చెను. హైదరు మరణానంతరము మహారాష్ట్రులు విజృంభిం చిరి. హైదరాలి సంపాదించుకొనియుండిన రాజ్య భాగములను జయించి వశపరచుకొనసాగిరి. టిప్పు సుల్తాను తండ్రి యంతటి సమర్ధుడు కాడు. రాజకీయ చతురుడు కాడు. టిప్పుసుల్తాను, అసమర్ధతను, మహారాష్ట్రుల ప్రాబల్యమును గ్రహించి నవాబు అధికారము క్రిందనుండిన సామంతరాజు లొక్కరొక్కరిగా మహారాష్ట్రుల పక్షమును జేరినారు. క్రీ.శ. **1786**వ సంవత్సర మున తిరుమల రాయలు మహారాష్ట్రుల అధికారము నంగీకరించి, తన రాజ్యమును గాపాడుకొనెను. "ది మహారాటాహార్స్ స్ప్రెడ్ దెమ్‌సెల్వ్స్ ఆల్ ఓవర్ ది కంట్రీ బిట్వీన్ ది కృష్ణా అండ్ తుంగభద్రా, వైల్ దేర్ రెగ్యులర్ ట్రూప్స్ వేర్ సర్సిప్లీ ఎంప్లాయిడ్ ఇన్ ది రిడక్షన్ ఆఫ్ ప్లేసస్, ఇన్‌ఫాక్ట్ ది హోల్ ఆఫ్ దెట్ సైడ్ ఆఫ్ ది తుంగభద్రా. అట్ దిసేమ్ టైమ్ ది పాళేగార్స్ ఆఫ్ సిరాహట్టి, దాముల్, కనకగిరి అండ్ ఆనెగొంది ట్రాన్స్‌ఫర్డ్ దేర్ అలెజియన్స్ టు ది మహారాటాస్ అండ్ ఇట్ సేమ్ యాజ్ ఇఫ్ ది మైసూర్ సావరీనిటీ ఓవర్ ది నార్దరన్ కర్నాటక వాజ్ ఫాస్ట్ షిప్పింగ్ ఫ్రమ్ టిప్పుస్ హాండ్స్...."

[వైడ్. ఇబిడ్. పుట. 694]

క్రీ.శ. **1799**వ సంవత్సరమున టిప్పు సుల్తాను నాలుగవ మైసూరు యుద్ధములో శ్రీరంగ పట్టణమున చనిపోయెను. మైసూచ రాజ్యము ఆంగ్లేయుల వశమాయెను. మహారాష్ట్రులకును, ఆంగ్లేయులకును మైత్రి యుండినందున తిరుమల రాయల అధికారమున కేలాంటి ఆటంకము గలుగలేదు. కాని, ఈ తిరుమల దేవరాయలెంతవరకూ రాజ్యమేలెనో తెలియదు. ఎట్లయినను క్రీ.శ. **1880-1901** వరకు అతడు జీవించియుండెనని చెప్ప వచ్చును. [చూ. మెకంజీ రికార్డులు]. టిప్పూ మరణానంతరము, మైసూరు సుల్తానుల రాజ్యమును ఆంగ్లేయులు, నైజాము మరియు మహారాష్ట్రులు పంచుకున్నారు. ఈ సంధి షరతుల ననుసరించి, తుంగభద్రా నదికి దక్షిణమున గల ఆనెగొంది మొదలగు ప్రాంతము లాంగ్లేయుల అధికారము క్రిందికి వచ్చినవి.

తిరుమల దేవరాయల తరువాత నెవ్వరు ఆనెగొందిని పాలించిరో తెలియదు. తిరుమల రాయలకు గొంతమంది భార్య లుండినట్లు తెలియుచున్నది. వారికందరకు మగ సంతాన ముండె నట. కావున, వారసత్వము విషయమున తగవు లేర్పడినట్లు తోచుచున్నది. ఆంగ్లేయ ప్రభుత్వమునుండి ఉపకార ధనమును బొందుటకై, తిరుమల రాయల పుత్రులలో కలహములు బయలు దేరినట్లు తెలియుచున్నది. ఆంగ్లేయులనుండి జీవనభృతిని పొందుటకై తిరుమల రాయల కుమారులలో గొందరిని విస్మరింప జేసి, మరియొకడు వారసుదారుడుగా ఆంగ్లేయ దొరతనము వారిచే గుర్తింపజేసికొనునట్లు తెలియుచున్నది. ఈ యేర్పాటు ననుస రించి, తిరుమల రాయల భార్యయైన నరసింగమ్మ రెండవ కుమారుడు వెంకటపతి రాయలు ఉపకారధనమున కర్హుడైనట్లు తెలియుచున్నది. ఈ వ్యవహారములు వీర వెంకటపతిరాయలు, ఆతని తల్లి మరియు నా కుటుంబము వారికిని, ఆంగ్లేయుల దొర తనము వారికిని మాత్రమే తెలిసియుండెను. అయినను, వెలుపలి వారెవ్వరికిని తెలియదు.

విజయనగర రాజ్యము, బాగా చితికిపోయి యుండినను, ఆ రాజులపట్ల విశ్వాసము గలిగి, వారినే నిజమైన దేశపాలకులుగా నమ్మియుండిన సామంతరాజు లక్కడక్కడ గొందరుండినట్లు తెలియుచున్నది. వారెవ్వరికీ వెంకటపతిరాయలు విజయనగర చక్రవర్తులకు నిజమైన వారసుడుగ అంగీకరించినట్లు తెలియదు. కావున, అసలు వారసుడు వేరొక వ్యక్తి యుండినట్లు తోచు చున్నది. ఈ విషయములను గురించి పై ప్రాంతములందు పర్య టించియు, అచ్చటి పెద్దలతో సంభాషించియు జేయుచుండగా, అదృష్టవశమున నీ ఆనెగొంది రాజులకు సంబంధించిన మరి యొక విశ్వాసార్హమైన ఆధారము లభించినది.

ఇదియొక భూదాన శాసనము. ఇది క్రీ.శ. 1816వ సంవత్సరమున వేయబడినది. ఇది కృష్ణగిరి తాలూకాలోని, వేపనపల్లి యను గ్రామమునకు జెంతనుండు బూదిముట్లులో నుండి నది*. పై సంవత్సరమున నీ ప్రాంతమును పాలించుచుండిన యొక పాళేగారుడు బూదిముట్లులోని శ్రీ కోదండరామస్వామి ఆలయములో కైంకర్యములకై ఆ సమీపమున నుండు 'హరియన పల్లి' యను గ్రామమును, దానమొసగి శాసనమును వ్రాయించెను.

పూర్వమీ ప్రాంతములన్నియు "అంకుశగిరి" యను సంస్థానమునకు జెందినవి. తర్వాత దానికి "బేరిక జమీందారి" యను పేరు గలిగినది. అంకుశగిరి యొక ప్రాచీనమైన ఆంధ్ర సంస్థానము. అంకుశగిరి దానికి ముఖ్యపట్టణముగా నుండెను. ఇది హోసూరు తాలూకాలో నున్నది. క్రీ.శ. 1644-45లో శివాజీ తండ్రియైన షాహజీ బెంగళూరు, కోలారు ప్రాంతములను జయించి వశపరచుకొన్నప్పుడీ అంకుశగిరి రాజ్యమును జయించి 'మాస్తి' యను గ్రామమును గైకొని అంకుశగిరిని ఆపాళేగారు నకు వదలివేసెను. ఇట్లే సుగుటూరు పాళేగార్ల వద్దనుండి సుగుటూరును గైకొని పుంగనూరును వారికే యిచ్చివేసెను. అంకుశగిరి మహారాష్ట్రుల వశమైన పిదప, ఆ సమయమున ఆ సంస్థానమునకు పాలకుడై యుండిన కెంపేగౌడ అనువాడు "బేరిక" యను గ్రామమును తనకు ముఖ్య పట్టణముగ జేసుకొని పరిపాలించుచుండెను. ఈతని యనంతరము యీతని కుమారుడైన "చొక్కగౌడ" యనునతడు పాలకుడై క్రీ.శ. 1828వరకు పరి పాలించెను. ఇది యిట్లు చెప్పబడియున్నది. "ది లాంగివిటీ ఆఫ్ దిస్ ఫామిలీ ఈజ్ సమ్‌వాట్ రిమార్కబుల్ యాజ్ కేంపేగౌండర్ హు బికేమ్ యాన్ వుమేదార్ ఆన్ హిస్ ఫాదర్స్ కాప్చర్ ఇన్ 1771 సీమ్స్ టు హావ్ బీన్ అలైవ్ అప్ టు 1813, వెన్ హి వాజ్ సక్సీడెడ్ బై చొక్కగానివారు, హిస్ ఎల్డెస్ట్ సన్ హు రూల్డ్ ఫార్ ఫిఫ్టీన్ ఇయర్స్ అండ్ డైడ్ వితౌట్ మేల్ హేర్స్ ఇన్ 1828...."

[మైడ్. సేలం డిస్ట్రిక్ట్ మాన్యువల్. పార్ట్. 2. పుట. 192]

ఈ చొక్కగౌడు పరమభక్తుడు. సాహిత్యాభిమాని. తన్నాశ్రయించిన సంస్కృతాంధ్ర కవుల నాదరించి, సత్క రించుచుండెనని తెలియుచున్నది. ఆ కవులు కొందరు వ్రాసిన పద్యములు, దండకములు కొన్ని లభించియున్నవి. చొక్కగౌడు బూదిముట్ల గ్రామమందుండు శ్రీ కోదండరామస్వామి ఆలయము నకు 'హరియ్య'పల్లి యను గ్రామమును దానమొసగుచు శాసనము వ్రాయించెను.*

ఈ శాసనమున చొక్కగాని పేరును, ఆ సమయమున విజయనగర చక్రవర్తుల వంశమువాడును, మరియు వారసుదారు డును నగు నతని నామధేయమున్నది. ఆ వారసుదారుడు, "శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర రాజకంఠీరవ ప్రౌఢ ప్రతాప వీరనరపతి శ్రీరంగదేవరాయలు."

ఈ శాసనమునుబట్టి ఆ సమయమున ఆనెగొందిలో శ్రీరంగరాయ లనునతడు రాజుగా నుండెనని తెలియుచున్నది. ఈతనిని, ఎనిమిదవ శ్రీరంగరాయలని చెప్పవచ్చును. మరియు నింతకుముందు జెప్పియుండు తిరుమలదేవరాయల అనంతర మీతడు రాజుగా నుండెనని చెప్పవచ్చును. శాసనమునందు చెప్ప బడియుండు బిరుదులనుబట్టి ఈ శ్రీరంగదేవరాయలు అరవీటి రాజుల వంశస్థుడని తెలియుచున్నది.

ఈ శాసనమునుండి మరియొక మంచి విషయము గూడ దెలియుచున్నది. 19వ శతాబ్దాదియందు కూడ, విజయనగర చక్రవర్తుల వంశమువారే నిజమైన, మరియు వంశానుగతమైన పరిపాలనాధికారమును గలిగియుండినవారని తెలియుచున్నది. ఆ సామ్రాజ్యము చితికిపోయి యుండినను, ఆ కాలమున నుండిన పెక్కుమంది పాళేగారులు వారి అధికారమందు విశ్వాసముంచి యుండిరని తెలియుచున్నది. ఈ శాసనము కన్నడ భాషలో నిట్లున్నది.

---

* బూదిముట్ల గ్రామములో గల శ్రీ కోదండరామస్వామి ఆలయ ధర్మకర్తలగు కీ.శే. శ్రీమాన్ రామేగౌని వారి వద్దనుండినది.

* ఈ దాన శాసనము శ్రీ కోదండరామస్వామి ఆలయ ధర్మకర్త లును, భగవద్భక్తులును అగు కీ.శే. శ్రీమాన్ రామేగౌడు అనువారివద్ద నుండెను.

"స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన వరుషంగళు ౧౭౭౦ యధాతు సంవత్సర భాద్రపద శుద్ధ ౧౫ రలు సర్వ దేవతా సార్వభౌమ భక్తజన కామితార్థ పదాన పీక్షా దురంధర శ్రీమద్గో రావతీపుర నివాస శ్రీ సీతాలక్ష్మణ సమేత శ్రీ కోదండ రామస్వామి యవర సన్నిధానదల్లి శ్రీమద్రాజాధిరాజ రాజ పర మేశ్వర రాజకంఠీరవ ప్రౌఢప్రతాప వీరనరపతి శ్రీరంగదేవ రాయ రవరు పృథ్వీరాజ్యంగై యుత్తలిరలు అచ్యుత గోత్ర పవిత్ర రాదమాస్తి ముమ్మడి చొక్కగౌడర పౌత్రరాద కెంపేగౌడ రవర పుత్రరాద మాస్తి ముమ్మడి చొక్కగౌడరవరు బరసి శ్రీరామప్రీతియాగి సమర్పణగైద గ్రామశాసన హ్యగందెరె...."

పై శాసనమునుండి గ్రామదాన మొనర్చినవాడు రెండవ (ఇమ్మడి) చొక్కగౌడని తెలియుచున్నది. వీరికి "మాస్తికులక" యను బిరుదుండెను.

ఇంతేకాక విజయనగర చక్రవర్తుల అధికారమును ఆనాడు కూడ అంగీకరించి, వారే నిజమైన దేశపాలకులని నమ్మి, క్రయ విక్రయ దానాదులకు సంబంధించిన దస్తావేజులు మొదలగువాని యందు ఆ చక్రవర్తుల సంతతివారినే యింకను పేర్కొనుచుండి రని విశదమగుచున్నది. అట్లు, ఆ వంశమువారిని పేర్కొనని యెడల ఆ దస్తావేజులు, పత్రములు మొదలగునవి చెల్లుబడి కాకుండెనని కూడ తెలియుచున్నది. ఆహా! యెంతటి స్వామి భక్తి! ఎంతటి విశ్వాసము!!

ఆ సమయమున, మైసూరు రాజ్యము చితికిపోయి యుండెను. మహారాష్ట్రులు, మహమ్మదీయులు, ఆంగ్లేయులు మొదలగు వారచ్చటచ్చట కొన్ని ప్రాంతములను జయించి తమ వశమందుంచుకొని యుండినను, వారిలో నెవ్వరికిని సర్వత్రా వ్యాపించి, స్థిరపడియుండిన అధికారముండలేదు. ఆనాటి ప్రజల దృష్టిలో వారెవ్వరును న్యాయమైన, వంశానుగతమైన హక్కు గలవారు కారు. ఇంతేకాక, ఆ సమయమున వారందరు దక్షిణ దేశమున రాజ్యదాహముతో పరస్పరము పోట్లాడుకొనుచుండిరి. వీరిలో మైసూరు రాజులు విజయనగర చక్రవర్తుల సామంత రాజులలో నొకరు. మహారాష్ట్రులు దోపిడీగాండ్రు. మహమ్మదీయులు హిందువులకు ప్రబల శత్రువులు, అన్యమతస్థులు. ఆంగ్లేయులు మతాంతరులే గాక కేవలము వర్తకులు. కావున, వీరిలో నెవరిని ప్రజలు నమ్మలేదు. అందువల్లనే విజయనగర చక్రవర్తుల అధికారమునే అంగీకరించి యుండుటమేగాక, దురదృష్టవశమున, వారి అధికారమాకాలమున చాలా సన్నగిలి యుండినను, మరల వారి అధికారము నెలకొనగలదను గట్టి నమ్మకము గలిగియుండిరని తెలియుచున్నది.

పై శ్రీరంగరాయలు క్రీ.శ. 1818కి ఆవల కూడ కొంత కాలము పాలించెనని తెలియుచున్నది. ఆవలి విషయములు స్పష్ట ముగా దెలియవు. అచిరకాలమందే ఆంగ్లేయుల ప్రభుత్వము దేశ మందంతట స్థిరముగా నెలకొనెను. అందువలన ప్రజలు, అచ్చ టచ్చట నుండిన చిన్న చిన్న పాళెగారులు క్రయ విక్రయాదు లను, పూర్వమందువలె కాక, ఆంగ్లేయ ప్రభుత్వమువారు ప్రవేశ పెట్టిన వారి అధికారముద్ర గల భాషా కాగితములందే (స్టాంప్ పేపర్లు) వ్రాయసాగిరి. ఈ కారణమునుబట్టి ఆనాటినుండి విజయ నగర రాజవంశమువారి నామధేయములు విస్మరింపబడి వదలి వేయబడినవి.

పై వివరములనుండి, ఆరవీటి రాజవంశముల వారేదో యొక విధముగా పరిపాలనాధికారమును 19వ శతాబ్దాదివరకు గలిగియుండిరని తెలియుచున్నది. ఇట్లు విజయనగర చక్రవర్తుల అధికారము కొందరు చరిత్రకారులు చెప్పియుండునట్లు 17వ శతాబ్దమువరకే కాక, 19వ శతాబ్దమువరకు నేదోయొక రూపమున సాగినదని చెప్పవచ్చును.

శాతవాహనాంధ్ర సామ్రాజ్యము క్రీ.పూ. మూడవ శతాబ్ది చివరి వారమునుండి క్రీ.శ. మూడవ శతాబ్దము తొలి పాదము వరకు అనగా దాదాపు నాలుగున్నర శతాబ్దాలపాటు దక్షిణా పథ మును అద్వితీయమైన, ఆదర్శప్రాయమైన కీర్తి ప్రతిష్ఠలతో పాలించినది. పన్నెండు శతాబ్దాల తావల ఉదయించిన విజయ నగర సామ్రాజ్యము అంతకంటె ఎక్కువ కాలము పాలించినది.

విజయనగర సామ్రాజ్యము దక్షిణ దేశమునకు జేసి యుండు మహోపకారము చెప్పుటకు వీలుకాదు. ఆ విషయమును గురించి పెక్కుమంది సుప్రసిద్ధ చరిత్రకారులు కడు హృద్యమంగా వర్ణించియున్నారు.

ఎట్లయినను, విజయనగర చక్రవర్తుల పరిపాలనము ఒక ప్పుడు మహోన్నతముగ, మరియొకప్పుడు సామాన్యముగ, వేరొకప్పుడు నామమాత్రముగ సాగినదని చెప్పవచ్చును. దీని నుండి ఆరవీటి చక్రవర్తుల పరిపాలనము 1576 నుండి 1800 వరకు సుమారు రెండు వందల సంవత్సరములపాటు సాగినదని గట్టిగా చెప్పవచ్చును.

విజయనగర సామ్రాజ్యము అది ఏర్పడిననాటినుండి, అనగా మొదటి హరిహరరాయలనుండి పై ఎనిమిదవ శ్రీరంగ రాయల పాలనము వరకు సుమారు ఐదు శతాబ్దాలపాటు జీవించి యుండెనని చెప్పవచ్చును.

# మహిషాసురుడు

## శ్రీ తంగిరాల

1

కాలం కీకారణ్యంలో
క్రౌర్యం ఘనీభవించి
మూర్ఖత్వం కండలు పెంచి
శుక్ల పక్ష చవితి చంద్రులు వాడి కొమ్ములుగా
శుక్రతారలు రెండు కళ్ళుగా
నఖశిఖ పర్యంతం కప్పిన అజ్ఞానం బురఖా నల్లని ఒళ్ళుగా
మండే మధ్యప్రాచ్యం ఇసుక గుట్టల్లో
ఓ మహిషాసురుడా! నీ పుట్టుక.

దుర్మదం పెచ్చు పెరిగి
దౌష్ట్యం హెచ్చి హెచ్చి
నింగిని చీల్చే రంకెలు వేస్తూ
ఖర్జూరపు చెట్లు కూలుస్తూ
ఎడారులు దాటి
బీడారులు దాటి
ఆర్యావర్తంలో అడుగు పెట్టావు
అమాయకుల పొట్టలు చీల్చిన నెత్తుటికొమ్ముల చంద్రుణ్ణి
అసూయాద్వేషాలు నిండిన చూపుల చుక్కల్ని
జెండాగా ఎత్తిపట్టావు
మా మీద బుసలు కొట్టావు.
నీ గిట్టల కత్తులక్రింద
పుణ్యభూమి బ్రద్దలై
భోరున ఘోషించింది —
నెత్తియల వేలాది నోళ్లతో
దోచుకోబడ్డ ఊళ్లతో
చెరచబడ్డ స్త్రీల కన్నీళ్లతో
మంటల కోరల్లో పడ్డ ఇళ్లతో
కాళ్లూ చేతులూ విరచబడ్డ దేవుడి గుళ్లతో....

2

నా చేతిలో చెట్టుకొమ్మలున్నప్పుడు - నీ చేతిలో
విల్లమ్ములు
నా చేతిలో విల్లమ్ములున్నప్పుడు - నీ చేతిలో కత్తులూ
కటార్లూ
నా చేతిలో కత్తులూ కటార్లూ ఉంటే - నీ చేతిలో
తుపాకులూ తూటాలూ
మట్టి బురుజుల మాటున నేను - మరఫిరంగులు
పేలుస్తూ నువ్వు
నేను ఏనుగు నెక్కితే నువ్వు గుర్రాన్నెక్కావు
నెగ్గితే తరుముకొచ్చావు - ఓడిపోతే పారిపోయావు!
నేను యుద్ధభూమికి వెన్ను చూపను
ప్రాణం పోయినా నీతి నియమాలు విడువను
ధర్మాధర్మాలతో నీకెప్పుడూ పని లేదు
నమ్మకద్రోహమే నీ రక్తంలో నిలువెల్లా పారే కుళ్ళునది
ఓరి పచ్చి అవకాశవాదీ! వట్టి గాలివాటు నీది.

మంచి - చెడునీ
నీతి - అవినీతినీ
ధర్మం - అధర్మాన్నీ
ఎప్పటికైనా జయిస్తాయన్న నా నమ్మకమే
దసరా అంటించిన దెయ్యం బొమ్మల మంటల్లో మెరిసింది
పేలిన బాణసంచా పిడుగుల్లోంచి పెళ్లున కురిసింది
నాది వెర్రి నమ్మకమని నీ చరిత్ర నిరూపించింది
నీ ప్రవర్తన పరిహసించింది
కుత్తకలు కత్తిరించి
కత్తుల వంతెనల మీంచి నడిచి
కులాల అనైక్యంతో కొట్టుకుచచ్చే మా నెత్తినెక్కి
తొక్కావు

గర్వంతో నిక్కావు
మా ప్రాణాలూ స్త్రీల మానాలూ
నీ కొమ్ముల శూలానికి గుచ్చి ఎగరేశావు
మా గుళ్ళూ గోపురాలూ నీ కళ్ళల్లో విరిగే ముళ్లు
మా తరతరాల ఆచారాలు నిత్యం నీ నోట్లో నానే తిట్లు
మా పవిత్ర పూజా విగ్రహాలు నీ ఎడమ కాలికింది మెట్లు
మా సిరి సంపత్తులు నీ తాతగారి సొత్తులు
కంఠంమీద కత్తి పెట్టి బెదిరించి
మాలో కొందర్ని నీ పశుత్వంలోకి లాక్కున్నావు
మా అందరూ కలిసి మళ్ళీ మా గుండెలమీద
మృత్యు తాండవకేళి!

3

శతాబ్దాల ఉలుల అనుభవంతో శిల్ప నైపుణ్యాన్ని పట్టి
ఈ భూప్రపంచంలో ఏ కంటిపాపా చూడని అందాన్ని
ప్రోవుపెట్టి
అద్భుత హంపీ విజయనగరంగా ఆవిష్కరించాము
శ్రీకృష్ణదేవరాయల్ని సాహితీ సమరాంగణ సార్వ
భౌమునిగా స్థాపించాము
మా కన్నపిల్లలకు ఆ చల్లని వల్లభుని పేరు
మా గ్రంథాలయాలూ విశ్వవిద్యాలయాలూ ఆ
ఆంధ్రభోజుని విలాస విహార భూములు
మా అష్టదిగ్గజ కవిలోకం ఆయన భువన విజయ
భుజకీర్తులు
మా సాహిత్య చరిత్రలో రాయల యుగం స్వర్ణయుగం
కృష్ణరాయల పేరు చెపితే ఒళ్ళు పులకరింపనివాడు లేడు
ఉంటే వాడు తెలుగువాడు కాడు!

అలనాటి విద్యానగర సిరి సంపదలు
సౌందర్యాలు సౌగంధ్యాలు సంగీతాలు సంతోషాలు
నృత్యాలు సాహిత్యాలు సౌహిత్యాలు
వజ్రవైడూర్యాలు నడివీథుల్లో నవరత్నాల రాసులు
బంగారు కాసులు చూసిన పోర్చుగీసు కనుల ఊసులు
రాయరాణువ శౌర్య సాహసాలు
దసరా కనకదుర్గ దరహాసాలు....

కాని
ఓ మహిషాసురుడా!
నువ్వు
నీ రక్కసి మూకనంతా కూడగట్టుకొని ఎదిరించి
ఓడిపోయి కాళ్లమీద పడి
క్షమించిన ఆ కాళ్లు పట్టి లాగి
సంధికి వచ్చిన రాయబారిగా నటించి చటుక్కున
దాడిచేసి

అన్నం పెట్టిన చేతికి సంకెళ్లు వేసి
పెంచిన తండ్రి తలకొట్టి జెండా కర్రకు కట్టి
మతోన్మాదం రెచ్చగొట్టి మారణహోమం చేశావు
గునపాలతో గొడ్డళ్ళతో ఘోర హత్యలతో
రణరంగాలతో మానభంగాలతో
ఆరునెలలు కొల్లగొట్టి నెత్తుటి మడుగులు సృష్టించావు
వర్ణించడానికి మాటలు చాలని సౌందర్యసీమను
క్షణంలో వల్లకాడుగా శిథిలాల బీడుగా మార్చావు
వందలాది ఏళ్లుగా చెక్కిన అపురూప శిల్పాలు
నీ వాడి కొమ్ముల కుమ్ములతో
రాళ్లుగా రప్పలుగా
ముక్కలుగా చెక్కలుగా
ఎప్పటికీ ఆరని
నా జాతి కన్నీటి చుక్కలుగా....మిగిల్చావు....
చరిత్ర నెత్తుటిరాతలు కన్నవాడు
పెయిస్, న్యూనిజ్, స్యూయల్ ప్రత్యక్ష కథనాలు
విన్నవాడు
ఎన్ని శతాబ్దాలకైనా నిన్ను క్షమించలేనివాడు....
విస్మృత మహాసామ్రాజ్యాన్ని
పగిలిన గుండెల్లో చితాభస్మంగా భరించేవాడు
పీడకలల కంటక కిరీటాన్ని ధరించేవాడు....

దుర్గకు ఎన్ని దున్నలు బలి యిచ్చినా
అవి మళ్లీ మళ్లీ పుడుతూనే ఉంటాయి
మెలి తిరిగిన కొమ్ములతో మమ్మల్ని కుమ్ముతూనే
ఉంటాయి

జమ్మూలో కాశ్మీర్‌లో
అలిఘర్‌లో అయోధ్యలో
లక్నోలో ముజఫర్ నగర్‌లో
అహమ్మదాబాద్‌లో
హైదరాబాద్ పాతబస్తీలో
గణేశులు ఊరేగే ప్రతి గల్లీలో
ఓ మహిషాసురుడా! నువ్వు ఎక్కడ ఉంటే అక్కడ
రాక్షసి - తంగడి రాబందు నీడ
మా మీద పడుతూనే ఉంటుంది
నీ మైనారిటీ నా మెజారిటీని భయపెడుతూనే ఉంటుంది!

4

భారతానికి గ్లాని వచ్చినప్పుడు
సాధువుల పరిత్రాణం కోసం
దుష్కృతుల వినాశం కోసం
'ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే'
ప్రతిజ్ఞాబద్ధుడైన మా దేవుడే
కృష్ణరాయలుగా రాణాప్రతాపుడిగా
శివాజీగా నేతాజీగా భగత్‌సింగ్‌గా
ఆజాద్‌గా వీరసావర్కర్‌గా అల్లూరి సీతారామరాజుగా
ఉరికంబాలను వరించే వేలాది అడవి వీరులుగా
నా రక్తంలో పొంగే ప్రతీకార జ్వాలగా
నా క్రోధారుణ మందారమాలగా
ప్రచండ చండి భయంకర జిహ్వాపల్లవంగా
పన్నెండు చేతుల భద్రాయుధాలుగా
నీ కుత్తుకమీదికి దూకుతున్నాడు....
ఎప్పటికైనా నీ పొట్ట చీల్చి పచ్చినెత్తురు జుర్రుతాడు
ఈ వజ్రపుగోళ్ల ఉగ్రనరసింహావతారుడు....

5

దక్షిణ భారత చరిత్ర కర్ణాట సంగీత గానసభలో
నిర్నిద్ర తుంగభద్రా తరంగాల తంబుఱ శ్రుతిలో
వీరభటుల కవాతుల తాళగతిలో
రాయల నవరాత్రి మహోత్సవాల దీపక రాగాలాపనలో
విజయనగర వైభవ గంధర్వగానంలో
నాడు మధ్యలో ఆగిపోయిన పురందర కీర్తన
నేడు అందుకుంటోంది మన జనతా ప్రభుత!
చాముండి త్రిశూలం వాడి మొనలూ
చండ సంహార క్రూరమైన కోరలూ
మహిషాసురుడి బండ గుండెల్లో బలిసిన కంఠంలో
కరకర దిగబడుతున్న మోత....

(25-10-1988 నాడు హంపీ విజయనగరంలో కర్ణాటకప్రభుత్వం జరిపిన దసరా మహోత్సవాల కవి సమ్మేళనంలో శ్రీకృష్ణదేవరాయల మంటపంలో చదివిన కవిత)



# పద్మావతీ చరణ చారణ చక్రవర్తి

## నాటిక

పాత్రలు ;

| | |
|---|---|
| జయదేవుడు | సిద్ధ కరాళీపుడు |
| పద్మావతి | శృంగార కావ్యనాయికలు |
| గోవర్ధనాచార్యుడు | గొల్లపడతులు |

| | |
|---|---|
| కాలం : | స్థలం : |
| 12వ శతాబ్దం; | బెంగాలు లేక ఒరిస్సాలో ఎక్కడో |

### 1వ రంగము

[బిందు (కెందు) బిల్వగ్రామము. జయదేవు నివాసము. ఒకవైపు ఉద్యానవనము. వేఱొకవైపున లతా మంటపమున రాధామాధవుల విగ్రహములున్నవి. వానిచెంతనే వెదురు వాకిలి. సమీప అనోకహాగ్రములపై అరుణోదయ స్నిగ్ధకాంతులు. దూరమున కర్షకుల అలజడి. మూడవప్రక్క నారికేళ కదళీ విటపి ఛదముల మరమర.

ఒక వేదిక. దానిపై లేఖిని మషీపాత్ర తాళ భూర్జ పత్రములు చెల్లాచెదఱుగ పడివుండును. వేదికపై జయదేవుడు. గౌర వర్ణుడు; దృఢకాయుడు; పొడవైన నాసిక; నిద్దపుఁజూపు; పీతాంబరము కట్టియుండును. తెల్లని ఉత్తరీయము, చేతఁదుళసీ దామము; చెవులలో కుండలములు; చందన తిలకము అది ఇంచుక చెఱిగియున్నది. అతడు తాళపత్రములఁ ద్రిప్పుచు నొకదానిఁ దీసి చదువ మొదలిడును. తెర వెనుక శంఖారావము.]

వాగ్దేవతా చరిత చిత్రిత చిత్త సద్మా,
పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ

శంఖధ్వని వెంటనే ఆగిపోవును. తెర వెనుకనుండి స్త్రీ కంఠము వినబడును. "దాని అర్థమేమో?" కాని జయదేవుడు చదువు సాగించును.

యవనికాభ్యంతరము నుండి ఒక స్త్రీ సహసాగమన కారణమున నూపురమేఖలా కింకిణుల సంయుక్త నిక్వాణము. జయదేవుని పత్ని పద్మావతి ప్రవేశము.

ఆమె శరీర ముజ్జ్వల శ్యామలము. అప్పుడే స్నాత యగుటవలన విశ్లథక బరీ ఘన కృష్ణకేశములు జలసిక్తములై యుండును. నుదుట కుంకుమ. కరమున లోహ శంఖముల కంకణములు. నెమలి పురి రంగు చీరె. ఆమె ముఖము కృత్రిమ క్రోధ లజ్జాయుతము.

పద్మావతి : [కటు స్వరమున] పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ అనుదాని కర్థమేమండీ:

జయదేవ : [ఉలికిపడి] ఆ! దేవీ పద్మావతీ! ప్రియే! నేననృత మాడను గదా నిజముగ నేను అలక్తకానురంజిత కిసలయ కోమలములైన నీ చరణముల దాసుడనే సుమా! [చిఱునవ్వు నవ్వుచు] ఐనను నా రచనలపై నింత రోషమేల నీకు?

పద్మా : ఇవి యన్నియు వ్రాయుటకు మీకు సిగ్గుగుటలేదా? మిత్రులు పరిజనులు పురజనులు విన్న నేమందురు?

జయ : (ఆవేశమున) ఏమందురు? జయదేవుడు యాయావారుడు. చరిత్రహీనుడు తపోభ్రష్టుడగును గాని మిథ్యావాది మాత్రము కాదందురు.

పద్మా : (వ్యంగ్యమున) మీ ఈ గుణము నధిక్షేపించుచునే ఆనాడు మారాంక మల్లదేవు ప్రోల ఓఢ్ర గాయనుడు బుద్ధ మిశ్రుడు అన్నమాట మఱచితిరా! "పాంచగౌడమున స్త్రీలే గుణసంపన్నలు. పురుషులు గుణహీనుల"ని!!

జయ : బుద్ధమిశ్రుడు నిజమే చెప్పెను. వాని అర్థమే వేఱు. వాని దృష్టి నిర్గుణవాదులపై నుండె. ఆ నిర్గుణవాదుల కఠోరాంత స్సాధన ఎవరు గమనింతురు? అదిగో అవధారు. సిద్ధ కరాళీపుడు నిరీశ్వర సాంఖ్యుడైన కణ్వాపుని తత్త్వము గానము చేయుచున్నాడు.

[వేణువనము బయట మలిన వేషధారియగు కరాళీపుడు పాట పాడుచు మెలమెల్లన సాగిపోవును. పాట క్రమశః తగ్గి పోవును.]

పద్మా: ఛీ ఛీ! ఏమి మగవారు! ఈతడు సిద్ధుడట! బుద్ధమిశ్రుడు గాయనుడట! మీరు కవులట? ఏమైననేమి? అందఱు....
(అని ఏమో అనుచు కోపమున వెళ్ళిపోవును.)

జయ : ఇదిగో విను. ఇదిమాత్రము తెలిసికొనుము. లోకములో చాలమంది జీవనగంగా హరిత తటముపై నుండియే తుష్టు లగుదురు. కొందఱు తరంగములపై కాలుసేతులు కొట్టు కొనుచు దుఃఖావతీర్ణుల మయితిమని, ఆనందావలంబితుల మయితిమని భావింతురు. వారే ధన్యులు - ఎవరు జీవన వాహినీ అంతర్గత పురుషార్థ ముక్త్యన్వేషులో!

పద్మా: [తల అడ్డముగా త్రిప్పుచు]నే తెలిసికొనను. (వెళ్ళిపోవు చుండును)

జయ : ఆహా! మౌనముద్ర కూడ ఎంత రమణీయము.

(పద్మావతి హరిణివలె దల వెనుకకు త్రిప్పి కోప దృష్టితోఁ జూచును; వెంటనే కౌటిల్యము పోయి స్నిగ్ధత్వము కనబడును. జయదేవుడు అవిరళముగ నవ్వును. పద్మావతి తటాలున దలుపు వేసికొని బయటకు నడచును.)

జయ : (ఉచ్చ స్వరముతో) గోలోకేశ్వరి రాధిక కూడ మాధవుపై గినిసెను. మాధవుడామెను సాంత్వన పఱచెను. పద్మే! ప్రేమ ప్రతిమే! కలహాంతరిత, రసరాజ్ఞియైనది రాధ; ఈ పరిణామ రహస్యమేమో తెల్పెదవా?

పద్మా: (వెంటనే) నేనేమియు దెలుపను.
(కవాటముపై చపేటా ఘాతమొనర్చును).

జయ : చాలు చాలు. ద్వారము వెనుక నీవున్నావని మాత్రమే తెలిసికొనగోరితిని. ప్రణయాందూబద్ధ రోషముచ్చ్రింఖలము కాదు కదా. మదీయవాణీ వీణాతంత్రులు మేళగించినవి. కలహాంతరిత రాధికామాన ప్రకరణము రచింప బోవుచున్నాను. కొన్ని గీతములు విను.

శ్లో॥ సవ్రీడ మీక్షిత సఖీవదనాం దినాంత
సానంద గద్గద పదం హరి రిత్యువాచ

(అని చదివి) ఇప్పుడు పదము వినుము.

పద్మా: హు, వినుచుంటిని

జయ : (ముఖారి రాగమున పాడును)
ప్రియే! చారుశీలే ప్రియే చారుశీలే
ముంచమయి మానమనిదానం

తర్వాత మాధవుడు రాధికా సాంత్వన మొనర్చును. నీ కినుక మాపుటకు నేనాడిన మాటలన్నిటినీ రాస నాట్యాచార్యునిచేఁ బల్కించినాను.

భణ మసృణవాణి, కరవాణి చరణ
ద్వయం సరస పదల క్తక సరాగం

పద్మా: (తెర వెనుకనుండే) మరల చరణములపై మరలితిరా?
ఈ చాటు కారిత్వ మెడలనే నేను మండిపడుదును.

జయ : కానీ నా అవస్థ విను. నా మాటలన్నిటికి ద్విగుణీకృత కోపయగుచుంటివే! శమితరోషయై ప్రసన్న యగుటకు రసేశ్వరి రాధికకు రాసలీలా నాథుడేమి చెప్పియుండ వచ్చునని!

పద్మా: స్నానా ధ్యానములు విడిచి ఈ కల్పిత కష్టములలోనే యుండుడు. మీ కష్టాలు తీరవలెనన్న వచ్చి ఆరగింపుడు, నేరంధనశాలకు బోవుచున్నాను. (పోవును)

## 2వ రంగము

[నది (గంగ కావచ్చు) తటమున జయదేవుడు - తెర వెనుక బాలికల కోలాహలము.]

1వ బాలిక: జయదేవ భట్టాచార్యులవారే

2వ బాలిక: ఈనాడేమో విచారగ్రస్తులైనారు. రండి. మాట్లాడింతము.

[ఆఱేడు బాలికలు వత్తురు. చేతులలో కడవలుండును.]

అందఱు : కవికుల గురులకు వందనములు.

జయ : (పరధ్యానమునుండి మేల్కొన్నట్లు)
ఓహో (తటాలున)
కాంతుని ఏ మాట విని మీ కోపము శమించినదో చెప్పెదరా?

బాలికలు : (కిలకిల నవ్వి) ఆచార్యులవారు హాస్య ధోరణిలో పడినారు. మేము ముగ్ధలమండీ? ఆ మాట మీ గృహిణినే అడుగకపోయితిరా స్వామీ?

జయ : అడిగినందులనే సమస్య జటిలతరమైనది.

బాలికలు : మీ సమస్య పూర్తి చేసికొనుటకు మీరే సమర్థులు. ఆశీస్సుల నిండు. పోయెదము.

జయ : ఏమని? మీరు ప్రియాకాంక్షలు. నేనో, నేనో ముక్తేశ్వర జగన్నాథ దాసుడ, ఐనను గైకొనుడు (దీవించును)

(బాలికలు గంభీర వదనలై వెళ్ళిపోవుదురు)

**జయ :** వేయి వసంతములు విజృంభించినట్లు, కమ్మీర వర్ణ పుష్పోపహార మొనర్చినట్లు, చంద్రికలు వెల్లువ గట్టినట్లు, గోపకిశోర వంశీగాన వివశములై గోవత్సములు పర్విడి నట్లు వీరు! మరి నా సమస్య??

(అటు ఇటు తిరుగుచుండును. నది కద్దటి ఒక స్త్రీ పోవు చుండును. జయదేవుడు నిదానించి చూచి గుర్తించి)

అహో మృడాని!

(ఆమె మాట్లాడదు. మెలమెల్లన ముందుకు బోవుచుండును)

సహపాఠినీ! భగినీ!

(ఆమె ఉలిక్కిపడి జయదేవునిఁ జూచి ముసుగు వేసికొని అవనత వదనయై నిలబడి)

కవి యోగులకు శతనమస్సులు.

**జయ :** సుమంగళీభవ. అన్నట్లు యవ ద్వీపమునందలి శ్రీ విజయ సామ్రాజ్యమునకు ఓడలపై బోయిన నీ పతి జాడ తెలిసినదా?

**ఆమె :** లేదు కవీ! మన్వంతరములైనవి, అటవీగత చంద్రిక యైనది నా బ్రతుకు. పదేండ్లనాటి నా స్వామి నవ్వు నాకింకను వినబడుచున్నది. అదిగో! స్వర్శము నా నర నరముల బ్రాకి తపింప జేయుచున్నది. వెన్నెల వేడిమి యైనది. బ్రదుకే బరువైనది. అతృప్త మనోరథము, అవ్యక్తబాధ, కృశాన జ్వాలలై నన్ను కాల్చుచున్నవి. నాకీ క్లేశము నుండి ముక్తి ఎప్పుడో? జగన్నాథా!

(ముందుకు సాగిపోవును)

(జయదేవుడు నొచ్చుకొనుచు దన కుటీరమువైపు మరలును)

## 3వ రంగము

(కుటీరము ప్రక్కన నికుంజపంక్తి. ఎక్కడో కింకిణీ నాదము విని జయదేవుడు కలయజూచును. వెనుక పొదరింటిలో నుండి ఒక యువతి బయటికి వచ్చి జయదేవుని జూచి కొంచెము బెదరి ముకుళిత హస్తయై నిలబడి)

**ఆమె :** పరమహంసలకు జోహారులు.

**జయ :** (తేటిపాఱజూచి) ఓహో మదయంతివా? సరి వాసవ సజ్జికవు అభిసారిక కూడ బనట్లున్నావే?

**మద :** హే స్వామిన్! అలంకారశాస్త్ర లక్షణములఁ బఠించి ఆనందించు దౌర్భాగ్యమే పోయినది నాకు. నేడు నా జీవితమే రస ప్రబంధము. నా ప్రియుడు నేను సృష్టిలో నుండు ఆనందమంతయు మీదుకట్టుకొన్నాము. కోకిల కంఠ మార్దవము, సుషమా ప్రసూన సౌరభము, నంద నందన మురళీగాన లహరి అన్నీ మా జీవితాంకితములు.

(జయదేవుని మనస్సున నొకానొక అలౌకిక భావము స్ఫురించును. అతని ముఖ ముజ్జ్వలమై దుర్నిరీక్ష్యమగును. మదయంతి అతని జూచి భయపడి తొలగిపోవును.

**జయ :** లేదు. రసమయ జగత్తు అగాధ మనన్యము. అలంకార శాస్త్రములకు నాట్య దర్శనములకు అందని ఏదో ఒక లావణ్యమయ రసభావ వీచిక పస్తుచ్ఛాయవలె మున్ముం దుకే పోవుచున్నది. పాంచభౌతిక దేహమున కావల ఇంకొక జగత్తున్నది. అది ఆనందవేలా వలయితము. సర్వభావములు అందు సాగరగత నదులవలె లీనమగును. అది ఆనందమయ లోకము. అది సచ్చిదానంద స్వరూ పము. దానిఁ జేరుటకు దారి? అందు జీవితము నిశ్చలము, నిభృతము, నిస్తరంగకము అట్టి జీవితము నాకు బ్రసా దింపవా హృషీకేశా!

(తిరిగివచ్చి యథాస్థానమున గూర్చుండును. వేణువన ద్వారమునుండి గోవర్ధనాచార్యులు శిష్యుడుదయునితో వచ్చును. గోవర్ధనుని ఒక చేతిలో గమండలము; వేఱొకదానిలో దండము; చంకలో దాళపత్ర గ్రంథము)

**గోవ :** ప్రాతఃకాలముననే ఏ సమస్యాపూర్తికై నిష్ఠ, కవీ!

**జయ :** (హర్షోత్ఫుల్లుడై) మహాకృప. దివాతల సూర్యుని దర్శనా నంతరము, క్ష్మాతల సూర్యుడు గోవర్ధనుల దర్శనము! సుఖాసీనులు కండు.

**గోవ :** లేదు బంధూ! తీరికెక్కడిది? నా "ఆర్యా సప్తశతి" ప్రతులు వ్రాసి ఒకదాని ఉమామహేశ్వరున కంకితము జేసి వచ్చుచుంటిని. నీ గృహమును జూచి భూతభావనుని ప్రసాదము, "ఆర్యా సప్తశతి" ప్రతినిత్తమని వచ్చితిని.

(గోవర్ధనుడు పొత్తము నిచ్చును. జయదేవుడు గైకొనును. అరటియాకు నొకదాని ద్రుంచి దొన్నెగా జేయును. గోవర్ధనుడు వెండి స్థాలినుండి తీర్థజల మిళిత క్షీరము పోయును.)

జయ : [(త్రావి)] అమృతతుల్యము.... అన్నట్లు ఆచార్యులవారూ! మీరు శృంగార రసాధినేతలు గదా! మాధవుడేమి చెప్పి మానవతి రాధికా మన్యుపశమనము జేసియుండునో చెప్పెదరా?

గోవ : నవరసరాట్టులు కవులు నన్నది గెదరేమి? తాదాత్మ్య ఫలిత నమ్యగనుభూతియందే రసావిర్భావము!

జయ : తాదాత్మ్యమా? (విలక్షణ స్వరమున)

[పరవశుడై నిశ్చలుడై ధ్యానబద్ధుడగును. గోవర్ధనుడు చకితుడై తదేకదృష్టితో జయదేవుని జూచును. మెల్లగా నటనుండి నడచిపోవుచుండును. జయదేవుడతని వెంబడించును]

గోవ : (జయదేవుని చేతులు పట్టుకొని) నాతో నెక్కడికి? కూర్చుని శాంతి బొందుము.

జయ : శాంతి ఎక్కడిది? అసంపూర్ణ అష్టపది. రసావిర్భావము నకే మార్గము సెలవిచ్చితిరి? దానినే పొందెదను.

[తటాలున వెనుకకు దిరిగివచ్చును. గోవర్ధనుడు మంద స్మితుడై వెళ్ళిపోవును. జయదేవుడు పీఠము దగ్గఱికి వచ్చి భూర్జ పత్రములు, మషీపాత్ర, లేఖిని శ్రీకృష్ణ విగ్రహ సమక్షమున నుంచి]

మాధవా చెప్పవా? మానవతీ క్రోధమెట్లుపశమింపఁజేసి తివి? దారి జూపింపవా నా స్వామీ? మనమిద్దరము వేర్వేరా? మనకు ద్వైధీభావమెక్కడిది? నీ వేషమే నాది. నీ భావములే నాయవి. చెప్పవా? నాథా! జగన్నాథా!!

[జయదేవుడు ప్రణయాంకిత దృష్టితోఁ బ్రతిమవైపు తదేకధ్యానుడై చూచుచుండెను. తాను కూడ రాతిప్రతిమయైనా డన్నట్లుండును. విగ్రహం కిరీటము దీసి తా ధరించును. అతని ప్రమత్తత వలన ప్రతిమ పైవైపు వున్న యవనిక జారిపడి విగ్రహమును మఱుగు పఱచును. తెరనీడయు, లతా నికుంజ చ్ఛాయయు బడి జయదేవు దేహమును శ్యామల మొనర్చును. అతడేమో వ్రాయ మొదలిడును. తెర వెనుకనుండి పద్మావతి పాట వినబడును.)

లలిత లవంగలతా పరిశీలన కోమల మలయ సమీరే
మధుకర నికరక రంబిత కోకిల కూజిత కుంజవిహారే.

[ముగ్గురు నలుగురు స్త్రీలు పాలకుండలు తీసుకొని వత్తురు. ఒకతె ఇంటి ద్వారమువఱకు వచ్చును. తక్కినవారు వేణువనము దగ్గఱనే నిల్చియుందురు. లతా మంటపమున నిల్చియున్న శ్రీకృష్ణ ప్రతిమ యున్నచోటనే అట్టి మూర్తియే కూర్చుండి వ్రాయుచుండుట జూచి ఆశ్చర్యపడుదురు. వారేదో గుసగుస లాడుచుందురు.]

మొదటి గోపిక : (తలుపు తట్టుచు) దేవీ! వాకిలి దెరువుమమ్మా. పాలు తెచ్చినాను.

పద్మా: (పాట నిలిపి) వారు బయటనే ఉన్నారు గదే. అక్కడే ఉంచుము.

గోపి : ఇక్కడ ఎవరు లేరమ్మా?

పద్మా: (తలుపు తెఱచి) ఎవరూ లేరూ? వారు స్నానమునకు పోయివుందురు. సరి. ఆ కుండ నిటుంచి తర్వాత తీసు కొని పొమ్ము.

[గోపిక పాత్ర నిచ్చును. పద్మావతి లోపలకు పోవును. గోపిక తిరిగివచ్చి తన నెచ్చెలుల గలిసికొనును. వారందఱు ఆ సజీవమూర్తి గాంచి భయముతో పర్విడుదురు. ఇట జయదేవుడు లేచి రెండుసార్లు ఉచ్చస్వరమున రాధే రాధే అని పిలుచును. అంతఃపుర ద్వారము దరికి వచ్చి రాధే రాధే అని సంబోధించును]

పద్మా: (తలుపు తీసి) స్నానమాడి వచ్చితిరా? భోజనము సిద్ధము.

[జయదేవుడు రాధే రాధే అని మాత్రమని భావోద్వేగమున బిగ్గఱగా నవ్వును. పద్మావతి మొదలే రోషముగా నున్నది. అతడి చేష్టలు చూసి ఈసడించుకొన్నట్లు కనబడి త్వర త్వరగా వెళ్ళి పోవును. బయట నికుంజమువైపు చూచును. విగ్రహ కిరీటము పడియుండుట గాంచి పొదరింటిలోనికి పోవును. నేలమీద భూర్జ పత్రముల గాంచి చకితయగును. కిరీటము విగ్రహము శిరముపై నుంచును. భూర్జపత్ర మొకటి తీసి చదువ మొదలిడును. పత్ర మును కుడిచేత నిడుకొని ఎడమ హస్తమును కపోలముపై నిడు కొని శిరము ఎడమవైపునకు వంచి విచారగ్రస్తయై యుండును. జయదేవుడు స్నానమాడి వచ్చును. చన్నీట మునిగినందున "చలాకీ"గా నగపడును.]

జయ : ప్రియా! మస్తిష్కములో నెంత వ్యథయో కుక్షిలో నంత క్షుధ.

పద్మా: ఇన్ని దినముల కీ రసికత నేర్చితిరా! అప్పుడే భుజించి వెళ్ళలేదా?

జయ : ఇది నా రసికతయా? నీ పరిహాసమా?

పద్మా: నా పరిహాసము కాదులెండు. నాయెడ అపహాస్యము. (రోషముతో) నాపై మీకింత వైరమేల? నా చరణములు మీ శిరోభూషణములని వ్రాసి నన్నుదికింప నెంచితిరా?

**జయ :** (ఆశ్చర్యమున) మఱల నేనేమి వ్రాసితిని?

**పద్మా:** (పత్రమును జూపించి) ఇదిగో చదువుకొని సంతసింపుడు.

**జయ :** (చదివి) దీవిని నే రచించితినా?

**పద్మా:** మీరు కాకున్న ఆ కృష్ణ శిలా ప్రతిమ రచించునా? రచించునపుడు లేని సిగ్గు పతించునపుడేల? చదువుడు.

**జయ :** స్మర గరళ ఖండనం మమ శిరసి మండనం దేహి పద పల్లవ ముదారం.

(పద్మావతి ముఖము చూచి) లేదు లేదు. దీని నే రచింపలేదు. మాధవుడు మాధవుడే రచించినాడు. ప్రియురాలి చరణ రుచిర రుచిచ్ఛాయలలోనే ప్రేమికుని నందన ముత్ఫుల్లమై ఆమోదము గుబాళించునని ప్రియ పదాంగుళే విరహి హృదయ వీణాతంత్రుల మేళగించునని నా స్వామియే తెల్పినాడు!!]

**పద్మా:** (భయముతో) అయ్యో అట్లనవలదు. నాకు భయమగుచున్నది.

**జయ :** నే మొదటనే చెప్పియుంటి గదా! ఈ అష్టపదిలో నాఅవదాని మాత్రము పూర్తి చేసితినని. కోపశమనమందు నాయనుభూతి ఎంతవఱకో అంతవఱకే రచించితి. కాని ఈ దివ్యానుభవము నా మాధవునిది. వాడొకడే పురుషుడు. పురుషోత్తముడు. తక్కిన మానవులందఱు స్త్రీలే. మానవులలో గొందరతని యభిసారికలు; కొందఱు వాసకసజ్జికలు; కొందఱు విరహిణులు. ఆ లీలా పురుషుడు తప్ప నింకెవ్వరు తెల్పగలరు? వివాహము పాణిగ్రహణమైన, ప్రేమ చరణగ్రహణమని! వివాహము కరగ్రహమున నైన నిర్వాహము పదగ్రహమున!! అతని శృంగార క్రీడయే రాసలీల. మధురభక్తి పరాకాష్ఠ! ఈ రాధామాధవ రసలీలయే నా మతము!!! ఇప్పుడే అష్టపది పూర్తి చేసెద.

[త్వర త్వరగా వ్రాయుచుండును. ఇంతలో, బాత్ర తీసుకొనిపోవ గొల్లలు వత్తురు.]

**పద్మా:** మీరున్మత్తులైనారా? లేక నేనే........ భగవంతుడే వచ్చి దీవినంతయు లిఖించినాడని నేనెట్లు నమ్మగలను?

**గొల్లవారు:** ఔనమ్మా! ఆ పొదరింటిలో గిరీటధారియగు మూర్తియేమో లిఖించుట జూచితిమి.

**పద్మా:** నిజముగనే?

[వివిధ భావ కిలికించితయై వడకి పడిపోవును. గోపికలు లేవనెత్తబోవ జయదేవుడు తర్జనితో వారించును. అష్టపది ముగించి వచ్చి పద్మావతి పొంత గూర్చొని ఆమె పాదముల గ్రహించి అప్పుడే రచించిన అష్టపది నందుకొనును.]

జయతి జయ దేవకవీ భారతీ భూషితం
మానినీ జన జనిత శాతం
ప్రియే! చారుశీలే! ప్రియే చారుశీలే
ముంచమయ మానమ నిదానం.

[జయదేవుడు మెల్లమెల్లన పద్మావతీ పాదముల తన శిరము దగ్గఱకు తీసికొనిపోవును. చరణములు తల దాకుచుండగనే పద్మావతి తటాలున లేచి కూర్చుండి జయదేవుని కాళ్ళు పట్టుకొనును. ఒకరి చేతులలో నింకొకరి పాదములుండును. గోపికలాశ్చర్యామోదముతో బాడ మొదలిడుదురు.]

తవ పద పల్లవ వైరి పరాభవమిద మనుభవ మతనువేశం
క్షణమధునా నారాయణం అనుగతి మనుసరరాధే

[గోపికల స్వరము క్రమముగ తారస్థాయికి బోవుచుండును. దూరమునుండి పసుల కాపరుల పిల్లనగ్రోవి పాట మలయమారుత లేక భటియార్ రాగమున వినబడుచుండును. మెల మెల్లగా తెర పడును.]

## శ్రీ పాతూరి రఘురామయ్య

# మాదిరాజు ముక్తకాలు - ఒక పరిశీలన

మాదిరాజు ముక్తకాలు మినీ కవితలు. ప్రతీకాత్మకంగా, కళామయంగా ప్రజాస్వామిక చింతన — మానవీయ భావన ఇత్యాదుల సమ్మేళనంతో మానవుని మనోలోకపు లోతుల్ని చూచే ఉద్దేశ్యంతో కవిత్వం వ్రాస్తున్నారు. అనుభూతియుతమైన అభ్యుదయ మానవీయ కవిత్వం మాదిరాజుది. ప్రపంచ చరిత్రలో అనేకమైన జాతులు, మతాలు, భాషలు, ఇత్యాదులైన భేద భావనలు కాస్కారమునిచ్చు అంశములు మానవజాతి మస్తకాల్లో పీఠం వేసుకున్నవి. ఒక జాతికి గానీ, ఒక ప్రాంతానికి గానీ, ఒక కులానికి గానీ, ఒక దేశానికి గానీ, ఒక ఖండానికి గానీ ఒకానొక ప్రత్యేకోద్దేశ్యంతో మాదిరాజు కవిత సంకుచితమైన దృక్పథాలను ప్రవచించలేదు.

ప్రపంచ మానవుని దృష్టిలో ఉంచుకొని అతని సమగ్రమైన అభివృద్ధి దిశాభిముఖంగా అనేక సమస్యలనూ - భౌతిక ప్రపంచంలోని సమస్యలనూ, ఆంతరంగిక మనోగత సమస్యలనూ యథావిధిగా గుర్తించి చిత్రించాడు. ఈ చిత్రించే పనిలో విలక్షణమైన ఒక ధ్వనిని ప్రవేశపెట్టాడు. ఆ ధ్వని సద్యః పరనిర్వృతి ఒక్కటే కాకుండా మానవుని కర్మశీలునిగా, యోజనాపరునిగా తయారుచేసే ఉత్తమ ప్రయత్నం - ఈ రెంటినీ కలిగి ఉంది. చిత్రించడంలో మానసిక స్థితులకు అనుగుణంగా తత్సంబంధిత ప్రాకృతికాంశాల సాదృశ్యములను చూపుతూ ఒక ఆర్ట్ ఫిల్మ్‌లాగా ముక్తకాల్ని కళామయంగా తీర్చిదిద్దారు.

ఉదయం నిశామృగాన్ని వేటాడుతూ రవి
గగనవనంలో అవతరించాడో లేదో
మేల్కొని నిదురించే పర్యంతం భూమిపై
మనిషిని వెంటాడే మనిషి, నీడను నీడ.

కవిత్వం ఆలోచనామృతం. అది పుట్టింది యోజనా మథనంనుండే మళ్ళీ అది మానవునిలో యోజనా శక్తిని పెంచే ఉద్దేశ్యంతో ఆనందాన్ని ప్రసాదించేటందుకు ప్రకటితమవుతుంది. నిశను మృగంతో పోల్చటం ద్వారా గగనాన్ని వనంతో పోల్చటం ద్వారా కవిలోని కవిత్వశక్తి పాఠకుని హృదయ స్పందనను పెంచుతుంది. కవి ఈ రకమైన చిత్రణ ద్వారా— అందే కావ్య లక్షణాన్ని దృష్టిలో వుంచుకొని పొడి వచనాన్ని అందించక - మానవ జీవవస్థితిని పోలిన ప్రాకృతికాంశాన్ని జోడిస్తూ ప్రపంచ మానవులకు సమస్యలు సహజాతములన్న ఉద్దేశ్యం ప్రతిపాదిస్తాడు. దీనిద్వారా పాఠకునిలో కర్తవ్యంపట్ల చెక్కుచెదరని ఆకాంక్ష ప్రబలమవుతుంది. జీవితంలోని కష్ట దశలు మానవునికి జీవితానుభవ నిర్దిష్టత కోసం ఉపకరిస్తాయి. ఈ విషయం కూడా అంతర్గతంగా శోభిస్తున్నది.

భాగ్యహీనుని కంటినుండి జారిన బాష్పకణం
చీకటి చివుకు బ్రతుకునెత్తి చూపే దీపం.

కవి మానవ హృదయం కనే కలల్ని పడే ఆరాటాన్ని కళామయంగా అభివ్యక్తం చేస్తాడు. బాష్పకణాన్ని దీపంతో పోల్చటంలో కవిత్వంలో మాదిరాజుగారి ఆత్మీయత ముద్ర ప్రగాఢంగా దృశ్యమానమవుతుంది. శబ్ద సంయోజన కూడా అత్యంత రమణీయమైన సొగసులతో అలరారుతున్నది.

సూర్యుడు ఆరిపోడు - భగవద్భావన చావదు
తమస్సు ఉండదెపుడు - ఆశలేక బ్రతుకులేదు.

ఇదివరకు పద్యాలలో చెప్పే ఎన్నో విషయాలు ఇప్పుడు వచనంలో వస్తున్నాయి. పరిస్థితులు ఎలాటివైనా ఒక భాషలో ఒక కవితో కవిత్వం ఆగిపోతుందా? అది జీవనగంగ - ఎవరు ఉన్నా ఎవరు పోయినా కొత్తి శక్తులు వాటంతటవే పుట్టి విజృంభిస్తాయి.[1] మాదిరాజు కవితలో నిగూఢమైన తాత్విక విషయాలు కూడా తేలిక భాషలో కనిపిస్తుంటాయి. ఆశలేక బ్రతుకులేదు. అన్నది అలాంటి పాదమే. 'ఆశకూ బ్రతుక్కీ ఎంత దగ్గరి సంబంధం' మానవునిలో ఆశాదీపం వెలిగించి జీవితంపట్ల స్పృహను పెంచే కర్తవ్యం ప్రశంసనీయం.

చావు జయింపబడదు అందుకే అంత భయం
గతం చచ్చినా రాదు - అందుకే అంత దురభిమానం
మెలకువయే వర్తమానం - అందుకే అంత ఇష్టం
భవిష్యత్తు భద్రమైంది - అందుకే ఎంతో ఆశ.

మానవ మనోధర్మాలను, లక్షణాలను ప్రతిబింబించే కాలసంబంధ స్పృహాత్మకమైన ఇట్టి పాదాల్లో వర్తమానమే అత్యుత్తమమైన విలువైన సమయమనీ, మేల్కొని ఉండటం, పరిశ్రమించడమే ఉన్నతికి మార్గమనీ స్ఫురింపజేసే వివేచనను అందిస్తున్నాడు. మానవ మనస్తత్వ పరిశీలనంలో కవికి గల శక్తి అపారం. నిత్య నూతన సత్యాలుగా విరాజిల్లే ఇటువంటి పాదాలు కోకొల్లలుగా మాదిరాజు కావ్యాల్లో దర్శనమిస్తుంటాయి.

కొందరికి చీకటిలో పయనించడంకన్న
వెలుగులో నిదురించడ మభిమతం
కొందరికి చీకటిలో నిదురించడంకన్న
వెలుగులో పయనించడం అభిమతం.

త్యాగశీలురు కొందరు, త్యాగశీలం లేనివారు ఇంకొందరు- ఈ విధంగా మానవులలో ఎప్పుడూ రెండు రకాలు ఉంటారు. చెప్పే రీతిలో వైచిత్రినీ, అర్థవైచిత్రిని వెలార్చే పై పద్య పాదాలు ఒకింత తార్కికంగా పాఠకున్ని ఊపేసే విలక్షణత్వాన్ని పుంజుకున్నవి.

బ్రతుక్కి లేదొక నియతమైన ఆకృతి
కల్సివస్తే పుష్పశయ్య లేకపోతే శరతల్పం.

మానవ జీవనరీతులు వేనవేల రకాలు-ఒక్కొక్క మనిషి ఒక్కొరకమైన చింతనతో వాని జీవిక కోసం జీవనరీతిని మలచుకుంటాడు - లేదా అందుకోసం స్వప్నిస్తాడు. శ్రమిస్తాడు, ఆరాటపడతాడు. అయితే ఈ కృషి, సాధన, వైఫల్యానికి గురయినపుడు సహజంగా అతని మనోబలం దెబ్బతింటుంది. తద్వారా అతని బ్రతుకు శరతల్పం అవుతుంది. వ్యాఖ్యాన ప్రాయంగా కనిపించే పాదాల్లోనూ కవిత్వపు ఆర్ద్రగుణం కనిపిస్తూనే ఉంటుంది.

కొన్ని చెట్లు పూలు ఎరగవు.
కొన్ని పూలకు పరిమళం ఉండదు.
కొందరికి హృదయం ఉండదు, బుద్ధిమనులు
కొందరికి అనుభూతి పట్టదు, అదృష్టవంతులు

ఇందులో వున్న బుద్ధిమనులు - అదృష్టవంతులు అన్న పదాలు సంస్కారంతో మండుతున్న నిప్పుకణికలు. పూలు లేని చెట్టును హృదయం లేని మనిషితోనూ, పరిమళం లేని పూలను అనుభూతి పట్టనివారితోనూ పోల్చడంలో ఒక విలక్షణత భాసిస్తున్నది. ఈ విధంగా ధ్వని ప్రధానమైన ప్రయోగాలు అపూర్వంగా మాదిరాజు కృతుల్లో శోభిస్తున్నాయి.

వెలుగు చీకటి ఎన్నటికీ కలవని మహాకాల నదీతీరాలు
స్వర్గనరకలోక సంకేతాలు మనసులోని ఆనంద విషాదాలు.

మానవుడు తనలోని ఆంతరంగిక స్థితులకు భావనలకు అనుకూలంగా భావనా ప్రపంచాన్ని నిర్మింపజేసుకున్నాడు. స్వర్గం నరకం సుఖదుఃఖాలకు ఆనంద విషాదాలకు సంకేతాలే.

జీవితం ఎగసిపోయే కాంతి విహంగం
బహుదూరం వెళుతుంది గతిస్తుంది
వెనక్కి రావడమంటూ ఉండదు.

కాంతియొక్క తత్వం జీవితానికి అన్వయించడం ద్వారా కవి విశిష్ట ప్రయోజనాన్ని నెరవేరుస్తున్నాడు. జీవితం కాంతి వంటిది. అది ముమ్ముందుకు వెళ్ళటాన్నే కలిగి ఉంటుంది అనడంలో మానవునికి ఒక సలహా అనేది గింగిర్లు తిరుగుతూంది. విహంగంతో పోల్చటంద్వారా సజీవవ్యక్తి నిత్య చైతన్య గుణం కలిగినవాడని చెప్పక చెప్పుతున్నాడు.

కొన్ని దిక్కులు మూసుకుని కొన్ని ఎత్తులకు చూపు తప్పించి దేశకాలైక దృష్టితో పరిమిత స్థానములోని అనుభవాన్ని పొందటం సహృదయుడు చేయడు.[2] అని సుప్రసన్న ఉద్ఘాటన. మానవుడు ఇట్టి స్వేచ్ఛాపిపాస గల విహంగం వంటివాడు. సకల విలువలను తెలిసికొని, సకల భావ-వస్తు ప్రపంచ అమూల్యాలను - తద్రహస్యాలనూ తెలిసికోవాలి. మానవుడు ఉత్తమమైనవానిగా రూపొందాలి. అలాంటి ఔన్నత్యం మానవునిలో కలిగించే జిజ్ఞాస ఈ కవిలో జాజ్వల్యమానంగా శోభిస్తున్నది.

ఆకాశమతిక్రమించే దురాశలో తహతహతో పైపై కెగిరే విహంగం
రవి తేజానికి భగ్గున మండి బొగ్గై ఏ మట్టిలో కలిసిపోయేదీ ఎరగదు.

దురాశ అత్యాశ వినాశకరమని మానవునికి హెచ్చరిక. ఇందులో మానవుడు అత్యున్నతమైన స్థానం కోరే క్రమంలో- పరిమితి దాటి చరిస్తే కలిగే ప్రమాదము కూడా స్ఫురింపజేశాడు. మానవునికి సమదృష్టి ముఖ్యమైనదని, సమన్వయదృష్టి క్షేమకరమని అంతర్గతంగా స్పష్టం చేస్తున్నాడు. ఈ విహంగం మన

స్సుకు ప్రతీక. ఇలా ప్రతీకాత్మకంగా చెప్పే వైలక్షణీయ అంశంగా పేర్కొనదగింది.

మానవుని సమార్ద్ర ప్రవృత్తి వివృత రూపాలు సంగీతం,
సాహిత్యం, శిల్పం, త్యాగం, మానవుని కఠోర ప్రకృతి
వివిధ ముఖాలు అధికారోన్మాదం, అహంకారం, యుద్ధ
మహాదాహం.

మానవుని సున్నితమైన, కోమలమైన, నిరాడంబరమైన పరోపకార భావనా సంయుతుడైనవానిగా తీర్చాలని ఆశిస్తున్నా ఈ కవి ద్వంద్వ ప్రకృతులనూ సమదృష్టితోనే చూస్తున్నాడు.

బ్రతుకులోని చివరి గడియ గత స్మృతులకు కేంద్రం
ఆవేళ కదిలే ఊహ విషబిందుయుత మధుకోశం.

కవిసాధన లక్ష్యము సత్యశోధనయే కాకున్నను సత్యశోధనాసక్తి యాతనికి గలదు.[3] కవి సమస్త విషయాలను పరిశీలిస్తాడు. భావనాశక్తిద్వారా తాదాత్మ్యం పొందుతాడు. తాను తెలుసుకొన్న సత్యాన్నే ఆవిష్కరిస్తాడు. ఇక్కడ మాదిరాజు మానవునియొక్క అంతిమ గడియ గురించి పరిశీలించాడు. ఆవేళ కదిలే ఊహ విషం నిండిన మధుపాత్ర అని వాస్తవాన్ని వ్యక్తీకరించినాడు. పరిశీలనా నైశిత్యమే ఇట్టి పంక్తుల్లో కనిపిస్తున్నది. తద్వారా సత్యప్రకాశము కలుగుచున్నది.

ఆగకు నడువు ఆలోచనలతో ముందుకు
ఎదురుపడని పరంపరగా పెనుచీకట్లు
విచ్చుకొని దారులవే ఇస్తాయి వెలుగుకు
గమ్యం తెలిసినపుడు ఉన్నచోటు చాలు.

సార్వత్రికంగా పరిణామాన్ని అంగీకరించేదే ఆధునిక కవిత్వం[4] అని సోమసుందర్ ప్రకటించాడు. మాదిరాజు కవిత్వం దాన్ని అంగీకరిస్తున్నది. సార్వత్రిక పరిణామాన్ని కవి మానవుని సమగ్రాభివృద్ధి కోసం ఆశిస్తున్నాడు. సమూలంగా గత వాసనలనుంచి విముక్తుడవు కమ్మనే చెప్పుతున్నాడు. ఈ ఉద్బోధలో ఒక విషయం మనం గమనించాలి అగమ్య సంచారం అనర్థాలకు హేతువు. అందుకే నిర్దిష్టమైన గమ్యం తెలిసి ప్రయాణించాలని కవి తాత్పర్యం.

మానవుని ఊహ చివరి బిందువు, ఈశ్వరుడు
ఈశ్వరుని సృష్టి చివరి రూపం మానవుడు
ఎవరికోసం నిర్మితమౌతుందో భవనం
వారి చేతులలోనే అవుతుంది వినాశనం.

హేతువాద దృక్పథమే కాక మానవ జీవిత సమగ్ర అవగాహన మాదిరాజుగారికి ఉంది. మానవ ప్రవర్తనరీతి అతనికి తెలుసు. మానవునియొక్క ఊహ చివరి బిందువు ఈశ్వరుడు. భగవంతున్ని మానవుడు తనకోసమే కనుక్కొన్నాడు. దర్శించాడు. భగవంతుడు మాత్రము మానవలోకాన్ని నిస్వార్థంగా సృజించాడు. వినాశం అన్నది ఇప్పుడు మానవుని చేతుల్లోనే ఉన్నది.

ఇసుకరేణువులు లెక్కపెడుతూ కాలక్షేపం చెయ్యకు
ఎడారి విప్పిన ఎదరూపం చూడు ప్రవాహ తరంగ
పంక్తుల నుహచేయి.

మానవునిలో నెలకొనవలసిన ఈ చిత్త సంస్కారం గురించి కవితలో ఆందోళన ఉంది. ఆరాటం ఉంది.

మనిషి ఒక పూవు, ప్రపంచం ఒక తోట
ఈ పూవులెన్ని విధాలంటే చెప్పరానన్ని.

అన్న కవి విశ్వమానవీయ సంగీతజ్ఞుడైన కవిశిఖరం. మానవీయకాంతి, ప్రజాస్వామిక స్వేచ్ఛాభావనలు హృదయ ప్రమాణగతమైన మనోలోకస్పృహ ఇత్యాదులను కలిపి ఒక విలక్షణమైన స్వరచిత్రం సృజించినాడు. అదే అతని కవిత్వం.

## ఉపయుక్త గ్రంథ, వ్యాస సూచిక :


1. కవిత్వానికి జబ్బు చేసింది — పురాణం సుబ్రహ్మణ్య శర్మ వెలుగులోకి ఇందూరు భారతి 4వ వార్షిక సంచిక పుట 65.
2. భూమిక - సుప్రసన్న సహృదయ చక్రం.
3. కవి సృష్టి ఆధునికాంధ్ర కవిత్వం సి.నా.రె.
4. కవిత్వం కాలాతీత కాంతిరేఖ - సోమసుందర్, పేజి. 37.

# "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?"

"పోయిందే!"




మేలుపరచబడిన అమృతాంజన్ వాడడంతో,

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా వుపశమింపజేయగలదు !




## మేలుపరచబడిన
# అమృతాంజన్

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా తిరిగి వికసింపజేయగలదు!

Amrutanjan Limited 

OBM 149 TG R

శ్రీ కాకులపాటి గురుమూర్తి

# మీరా

ప్రభూ! ఏమిటి యీ వెర్రిలోకం - మీరా వెర్రిదనుకుంటోంది! రాయి మగడేమిటంటున్నారు! కృష్ణా! నీవు రాయివా? - ఈ రాతిలో వున్న రామణీయకత వీరికెలా తెలుస్తుంది. మానవుకి రాతిగుండె కరిగినప్పుడే రాతిలోనుంచి నీవు పలికేది. పసితనంలో స్నేహితురాలి పెళ్ళి అవుతూంటే నా పెళ్ళెప్పుడని అమ్మను అల్లరి పెట్టానట. నా భర్త యేడీ, అని అడిగానట. అమ్మ కోపంతో "అడుగో!" అని నీ విగ్రహాన్ని చూపించిందట. ఆమె కూడా 'ఆ రాయే నీ మగడు' అని విసుగుతో చూపించిందేమో! పూజ మాత్రం రోజూ చేస్తూండేది, రాయి భావంతో. కాని రమణీయ భావాన్ని నాకు అందించింది. తర్వాత నా కళ్ళల్లో నీవే నిండావు - నా హృదయమంతా! మనస్సంతా! దేహమంతా!

ఎందరో మానవులు నాకు కన్పిస్తూనే వుండేవారు, వారందరూ నీ రూపంలోనే నాకు కన్పించేవారు. వారందర్నీ 'కృష్ణా!' అనే పిల్చేదాన్ని. నన్నే నీ నివాసం చేసుకున్నట్టున్నావు. ఎక్కణ్ణించి వొచ్చింది ఈ సంగీతం! ఈ పాటలు! అందులో యేదో మాధుర్యం వున్నదట, వినడానికి! ఆ మాధుర్యాన్ని గ్రోలడానికి జనమంతా నా చుట్టూ మూగేవారట. నాకేమీ తెలియదు. నీ మీద పాటలు పాడడమే! -అంతే! ఏమి పాడుతున్నానో నాకేమి తెలుసును? -నీవే పాడుతున్నావేమో; లేకపోతే నీ నామంలో అంత తీపి యేమిటి! ఆ తీపి యేమిటో చెప్పలేక దాన్ని సేవించాలని తిరుగుతారట నా చుట్టూ ఈ జనం! వారు కూడా అలా పాడకూడదూ? ఆ మాధుర్యాన్ని స్వయంగా త్రాగకూడదూ?

నాకు నీతో చిన్నప్పుడే పెళ్ళి అయింది. మళ్ళీ మహారాణా వారితో పెండ్లి చేశారుట. హ్హా! హ్హా! హ్హా! ఇదేమిటి, హిందూ స్త్రీకి ఇన్నిసార్లు పెళ్ళి చేస్తారా? పాపం! మావారు నన్ను రాణివాసంలోనే వుంచాలని చూశారు - కాపలా పెట్టారు - కాని నాలో నీపై ప్రణయ ప్రవాహం ఉబికి నన్ను త్రోసుకుని బైటికి లాక్కు వొచ్చేది. నేను మహారాణీనట! నన్ను ఎవ్వరూ చూడకూడదట! నేను వీధుల్లో పాడకూడదట! కానీ ఏం చేయను? నాకేం తెలుసు? తెలియకుండానే నీ గుణాల్ని స్తుతించేదాన్ని. కృష్ణా! దీనికి మహారాణావారు వో ఉపాయం చేశారు. కోట ఆవరణలోనే వో పెద్ద కృష్ణాలయం కట్టించారు. నీ ఆలయం ఎక్కడ వుంటేనేం? - అక్కడే పాడుకునేదాన్ని. అంతటితో, జనం రాకూడదని శాసించారట లోపలికి. అలాగే లెక్కలేనన్ని పాటలు పాడుకునేదాన్ని. నా తప్పేముంది? నేను రావొద్దనలేదు జనాన్ని. అలా పాడ్తూంటే నీవు నృత్యం చేస్తూ కనిపించేవాడివి. మెల్లగా బయటికి త్రోవ తీసేవాడివి. నే లోపల వుండగల్నా?— నేనూ బయటికి పరుగెత్తుకు వొచ్చేదాన్ని. జనమంతా నా వెంట పడేవారు. నా పాటలు వారు కూడా నాతో పాడేవారు. -మళ్ళీ తుర్రుమని ఆలయంలోకి పరుగెత్తేవాడివి. నేనూ నీతోపాటు పరుగెత్తి వొచ్చేదాన్ని. నాతో జనమంతా ఆలయం లోపలికి వచ్చేవారు. మళ్ళీ పాటలూ, భజనలూ సాగుతూనే ఉండేవి. ఇహ నేనొక పిచ్చిదాన్నని వొదిలి పెట్టేశారు.

నీవు నన్నొకచోట వుండనిస్తావా? బృందావనానికి లాక్కొచ్చావు. నా వెంట యెంతోమంది జనం కూడా వొచ్చారట! అది నాకేం తెలుసు? అందరూ నీలాగే ఉండేవారు. ఇంతమంది కృష్ణులా!! ఇంతమంది భర్తలా!! హ్హా! హ్హా! హ్హా! వింత భర్తవయ్యా నువ్వు! పదహారువేల గోపికా స్త్రీలకు పదహారువేల కృష్ణులుగా తయారయ్యావట! నీ సంగతి నీకే తెలియాలి! నాకేం తెలుస్తుంది?

ఓ రోజున ఓ వింత జరిగిందట. ఇవన్నీ ఎందుకు చెప్తున్నావంటారేమో? ఇంకెవరితో చెప్పను, భర్తతో చెప్పక?- ఆ వింతేమిటంటే, అక్బరు పాదుషాకు నన్ను చూడాలని- అంటే నీమీద పాటలు పాడే నన్ను చూడాలని - యెన్నాళ్ళనుంచో ఉందట. కాని పాదుషాలాగా చిత్తూరు యెలా రావడం? అందులో మహారాణీని చూడడం యెలా? అందుకని పాదుషా, ఆయన ఆస్థాన సంగీత విద్వాంసుడు తాన్సేను యిద్దరూ భక్తుల వేషాలు వేసుకుని, మెల్లిగా ఆలయంలోకి ప్రవేశించారట! నేను పాడుతూ ఉంటే, పాదుషా తన్మయుడై అలాగే ఉండిపోయాడుట! తాన్సేను ఆయన్ని మళ్లీ చైతన్యంలోకి తెచ్చాడట. భజన ముగిసిపోయేలోగా - ముసల్మాన్లు యెవరో కోటలో దూరినట్లు తెలిసి తెగ గగ్గోలవుతోందట. విద్వాంసుడు ఎలా పసిగట్టాడో, పాదుషాని

మెల్లిగా బయటికి లాక్కుపోబోయాడట. పాదుషా, తెలియక, పువ్వులేవీ తేలేదట. అప్పుడు పాదుషా, ధ్యానంలో ఉన్న నా చేతుల్లో ఓ హారం వదేసి మెల్లిగా బయటపడ్డాడట, సహచరుడితో. నా చేతుల్లో ఉన్న హారాన్ని పువ్వుల్తోబాటు నీ చరణ కమలాలకి అర్పించానట. అది హారమో యేమో నాకు అంత పరీక్ష లేక పోయింది. తర్వాత రక్షకభటులు వచ్చి ఆలయం కూడా వెదకి, ఆ హారాన్ని చూసి బయటికి తీస్తే దానిమీద పాదుషా నామాక్ష రాలు ఉన్నాయట. రాణావారికి యిది తెలిసి, పెద్ద అల్లరయిం దట. - నన్ను దండిస్తానన్నారట. నాకేం తెలుసు? "నాకు ఆలయంలో ముసల్మానులెవరూ కనిపించలేదు, అందరూ కృష్ణులే కనిపించారు" అన్నాను. నిజమూ అంతే! ఇదంతా చూస్తే నేను రాజకుటుంబానికి అగౌరవం తెస్తున్నా నన్నారట అందరూ!

రాణావారికి తెలియకుండానే యెవరో ఘాటయిన గరళం తెచ్చి యిచ్చారట నాకు. నీ పాద తీర్థమంటే తాగేశానట! నేను బ్రతికే ఉన్నానుట! ఆఁ! బ్రతికే ఉన్నానట! నాలో దాక్కున్న నువ్వే తాగేశావేమో! - అలా కనిపించిందట, అందరికీ!! ఈ సంగతి యెలాగో మహారాణావారికి తెలిసింది. అప్పటిమంచీ మహారాణావారు కూడా నాతోబాటు మీ పాదసేవ మొదలుపెట్టారు. అప్పటినుంచీ నాకు యే యిబ్బందీ లేకుండా గడిచిపోతోంది; నా పాటల్లో - నీ ఆటల్లో!!

పెడమొగం పెట్టావా? ఇక వినవూ? పోనీలే, ఇదుగో, చిక్కిపోయావు - కొంచెం వెన్నైనా తిను - తింటున్నావూ!- హమ్మయ్యా!, రుచిగా ఉంటుందంటున్నావు కూడానా!-ఎక్కడిదో యీ వెన్న యిక్కడ?- నేనెక్కడికీ వెళ్ళి తేలేదు సుమా-ఇక్కడే ఉంది - నేను నీకు అందించానంతే!- దొంగా! తినేసి పారిపోతు న్నావు?- కృష్ణా! కృష్ణా! వెళ్ళిపోతున్నావూ - నన్ను ఒంటరిగా వదిలేసి వెళ్ళిపోతావా? - ఇది న్యాయమేనా? అర్ధరాత్రివేళ భార్యను ఒంటరిగా వదిలేసి వెళ్ళిపోతావా?- నాకు భయం వేస్తోంది- నేను ఒంటరిగా ఉండలేను - కృష్ణా! కృష్ణా వచ్చావా? - ఎక్కడి కయ్యా పారిపోతావు? నా దేహం నీకు అర్పించేశానే-ఇంతకంటే చక్కని సౌధం - ఇంతకంటే స్వచ్ఛమైన హర్మ్యం-ఇంతకంటే శాంతి గల భవనం నీకు దొరుకుతుందా?- నవ్వుతూ వెళ్తు న్నావూ? ఇది హాస్యంగా ఉందా నీకు?- ఆగు! ఆగకపోతే చెట్టుకి కట్టించేస్తాను - అప్పుడెలా పారిపోతావు? - అయ్యో!- ఆగి బిక్కమొగం వేశావు - ఏమన్నాను? - కఠినంగా మాట్లా డానా?- నొప్పించానా? ప్రభూ! ప్రభూ! మన్నించు - నీవు వెళ్ళి పోతే వియోగాన్ని భరించలేనని అన్నానేమో!- ప్రభూ! వచ్చావా మళ్లీ ఆలయంలోకి?- నీవు వెళ్తుంటే ఈ ఆలయమే చిమ్మ చీక టయింది! నీవు ఆగగానే మళ్లీ మెరిసిపోతోంది-ప్రభూ!!

*చిమ్మచీకటిలోన - చిరుచుక్కలున్నాయి
వెదరి కాంతులు కొన్ని - వెదకికొనివచ్చి నీ
మొగముపై చిందినవి ముత్యాల మినుగురులు
ప్రాంగణమ్మున నిలచి - పలుకరించాను - నీ
పెదవి కదలిందేమొ - కదలనేలేదేమొ,
పలుకవా, నా ప్రభూ?
అలుకయా నా ప్రభూ?*

*తేనె చిప్పిల్లేటి - తెలిపూలు తెచ్చాను,
తెలిపూలు తొలిపూలు నిలచి - నే వెయ్యాలి,
జలజలా రాలి అవి - కిలకిలా నవ్వాలి.
పూలపై తలపెట్టి - తెలివి కోల్పోయి నే
ఘడియలో క్షణములో - నడి
తెలుసుకోవాలి - నీ నడి
తెలుసుకోవాలి.
పలుకవా, నా ప్రభూ?
అలుకయా నా ప్రభూ!

కృష్ణా! ఇలా కనిపిస్తావు, అలా పారిపోతావు! నా ప్రేమ స్వచ్ఛమయింది కాదా?- ఇదో వేదన ఆరంభమయింది నాలో!- నీవు యెప్పుడూ నా కళ్ల యెదుటే ఉండాలి - నీ కాంతుల్తో నా కళ్లు మిరుమిట్లు గొలపాలి! నీ వాత్సల్యంతో నన్ను నే మర్చి పోవాలి - ఇదీ నా వాంఛ! నేను నావ లేకుండానే నీ దయా సముద్రాన్ని యీదుతున్నానేమో అనిపించింది - ఆ దయార్ణవ తరణానికి నావ సద్గురువేనని నిశ్చయించుకున్నాను - అన్వేషణ ఆరంభించాను - ఆ ఆవేదన వర్ణించలేను.

"సద్గురు జైసా వేదన కోఈ, పూఛో వేదపురానా,
మీరాకే ప్రభు గిరిధరనాగర - అమరలోకమే రహానా!"-

అని పాడుకుంటూ అన్వేషించాను — నా అదృష్టంవల్ల 'రైదాసు' లభించారు - వారివల్ల నిన్ను కట్టివేసే పరమ రహస్యం గ్రహించాను — కృష్ణా! గ్రహించాను పరమ రహస్యం!!- బంధించాను నిన్ను!- నా నిశ్చల ప్రేమతో!- నీ నామ స్మరణతో - కృష్ణా! కృష్ణా - నీ నామమే జపించాను- పాడాను - ఆడాను - నన్ను నే మర్చిపోయాను - మారిపోయాను- నీరై పోయాను!!

"కృష్ణ కృష్ణ మై కరతీ థీ!
తో మోహీ కృష్ణ హోగఈ!
కృష్ణ కృష్ణ మై కరతీ థీ
తో మోహీ కృష్ణ హోగఈ!!!

# ఆశ

## శ్రీ ఆదూరి వెంకట సీతారామమూర్తి

తూగుటుయ్యాలలోని పాపాయి కేరింతలు చూసి మురిసే
మాతృమూర్తి కళ్ళలో ధేను
వీరతిలకం దిద్ది వీర జవానును తీర్చిదిద్దే
వీరవనితల కళ్ళలో కదలాడే కన్నీటి కెరటంలోనూ నేనే!

నిండుపున్నమి పండు వెన్నెలగా పరుచుకున్న వేళ
హృదయాగమంగా హృదయేశ్వరుని కోసం పరితపించే
జవరాలి వలపు కళ్ళలోని తలపుల గోదావరిని నేను,

నిశిరాత్రి జైలు కటకటాల వెనుక రోదించే
నిస్సహాయ నిర్దోషి కళ్ళలో మిగిలే కాంతినీ నేనే!

అగమ్యమమై అస్తవ్యస్తమైన సంఘంలో
దారి తెలియని; మార్గదర్శకులు రాని
నిర్భాగ్యపు నిరుద్యోగుల మనసుల్లోని రేపటి వెలుగుల
సూర్యుణ్ణి నేను.

అంచలంచలుగా తోటివారి శిరసుల్నే సోపానాలుగా
జేసుకుని
పైపైకి పోయే స్వార్థపరుల అణువణువునా నేనే!
కడుపు దహించి పడుచుకునే యీ దేశపు ఆడపడుచుల
జీవనాల్లోనూ,
కడుపును పుట్టిన బిడ్డల్ని కాసుకు అమ్ముకునే
తలిదండ్రుల గుండెల్లోనూ,

అమావాస్య ఆకాశం క్రింద సగంకూడ నిండని
కడుపులతో
రేపటికోసం కళ్ళలో వత్తులేసుకునేవారి తలల్లోనూ
నిరుద్యోగుల్ని కన్న నిస్సహాయ తలిదండ్రుల
తలపుల్లోనూ
కట్నపిశాచాల బారిన పడుతూ పగటికలలు కనే
మగువుల కలల్లోనూ.... నేనే!

అభినందనల దండల్లో మునిగి జనాల చప్పట్లలో తేలి
సింహాసనాల మెత్తల్లో విశ్రమించే నాయకుల మనసుల్లో
నేను

ఏ అభిమానాలకూ నోచుకోక ఆదరణ కర్థం అనలే
తెలియక
పసితనంలోనే కష్టించే బాలకార్మికుల అమాయక
వదనాల్లోనూ నేనే!

మేధావుల్నీ మేలుబంతుల్నీ సృష్టించి కూడ
నేటి అస్తవ్యస్త అల్లకల్లోల పరిస్థితులకు
తల్లడిల్లే భరతమాత నయనాల్లోనూ నేనే!
నేను ఆశని—
భవితవ్యంలోకి నడిపించే బాటని-
ఆశయాలను జోడిస్తే
ద్విగుణీకృత వెలుగునిచ్చే జ్యోతిని!

---

## అన్నలీల!

అన్నమున బుట్టి పెరుగును అఖిల జీవ
రాశి మరణించి మరియొక ప్రాణితతికి
నన్నమగు సృష్టియంతయు నన్నలీల
అన్నమిలను పరబ్రహ్మమగును సుమ్మి!

## ఇద్దరును లేని కాలమందు...!

కర్షకుని పంటచేతను కాయపుష్టి
కవుల రచనల మనసుకు గలుగు తుష్టి
గాన నిద్దరును లేని కాలమందు
మనుజుడున్నను లేనట్టి మహితలాన!

శ్రీ కపిలవాయి లింగమూర్తి

# విరహిణి!

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

ఆశలు మోసులై వలపు టామని సీమ - నిరంత చింతనా
భ్యాస వియోగ యోగ పరిపాటిత చిత్తముఁ దాల్చి - మాధురీ
శ్రీ శివ సత్యసుందర విశిష్టము నీ యెదఁ దల్చి - యశ్రుధా
రాశకలమ్ము ముక్కుకొనలంబడి జారగ నిల్తు బొమ్మనై!! 1

గడచిన కాలమెల్ల యొక కత్తుల బోనయిఁ దోచు - చీకటుల్
తడబడి వెల్గురేకలకు దారుల నిచ్చిన యీ క్షణాన - యీ
గడుసు కరాళ శైశిరపు కర్కశ నృత్యము మందగింప - గు
య్యెడెడు మదీయ జీవవని కింత వసంతము నిచ్చి - నిల్పవే!! 2

వెదుకుచు వీథులం దిటిగి వెఱ్ఱిగ నేగెడు నన్నుఁ గాంచు దు
ర్మద పరిహాస మూఢజనులం దలకంపగఁ జేతు - నీ
మృదు పద కోమలాంబుజ సమీహిత భాగ్యమనుగ్రహింపుమో
విదిత కళాకలాప కలవేణు రవామృతసాంద్ర! మత్ప్రభూ!- 3

కాల నదీప్రవాహమున కాళులు చేతులు కొట్టుకొంచు ద్వీ
పాలను వేలుదాటి యిటు వచ్చితి - క్లేశ భరాలసంబుగా
ప్రాలితి భూమిపై - రసభవ న్మురళీరవగీతి మచ్ఛ్రవః
పాళికిఁ జేరకున్నెడల ప్రాణము గూటికిఁ జేరునా ప్రభూ!! 4

పున్నమి రేలతో కరిగిపోయితిఁ బోయితి బృంద వీథులన్
కన్నుల వత్తివైచుకొని - గాఢతమాల నికుంజ సీమలన్
సన్నని ముళ్ళబాటలను సాగితి - త్వత్ప్రియహాసరేఖకై
ఎన్నని విన్నవించెద మదీయ విషాద కథా తరంగముల్ 5

ఏ నీటి మడుగుఁగానీ ఎదురైన యా
యమునయే నన్పించు నన్నిసార్లు
ఏ మయూరమునుఁగానీ కాంచినంత యా
శిఖిపింఛమౌళియే చిక్కుమదికి
రాగాల గని - మృదురాగాలఁగని - వంశ
నాళమ్ము మ్రోగును నా యెడంద
పద్మ పత్రమ్ము సంభ్రమముఁ గొల్పును నల్ల
నయ్యకన్నులవోలె నవ్వు రువ్వి

అసలు నాలోక మేమొ - యీ రసప్రకృతికి
నాకు బాంధవ్యమేమొ - సుంత గనరాదు
తెల్వి సగమును మఱుపు బంధించినట్టి
విశ్వగవేషణాయితను గోపికను నేను! 6

మకరికాపత్ర సుందరిత కపోలముఁ
    గూర్మితో ముద్దిడుకొన్న గుర్తు
ప్రణయ పరీరంభ రసడోల నిర్వృతిఁ
    బ్రాణమ్ము లుడికించినట్టి గుర్తు
కల వేణు రవగీతికా సతీర్థ్యముఁ గాగ
    సన్నగాఁ బాడించుకొన్న గుర్తు
హృదయ నైవేద్య మధూర్జిత క్షణమున
మూగనై తలవంచి మ్రొక్కు గుర్తు

అంది అందని స్వప్న చేలాంచలములు-
విరిసి విరియని తలపుల విరులు - ఉరులు!!
ఎక్కడో మంద్రగతి మ్రోగునే మురళియొ-
వీనులంబడి - హృదయంబు వేగిరపడు!! 7

నా యన్వేషణ వ్యర్థమై - బ్రతుకు నానాకష్ట భూయిష్టమై
నా యాశానవహమ్ము - చింతన మహాంధక్షిప్త శప్తమ్మునై
ఏయే దారుల సాగుచున్నదియొ - అందే సుహోపద్ధునీ
ప్రాయంబైన యపస్థ నొందెడినా! గోస్వామినీ! విలోకింపవే!! 8

~~~~~~~~~~~~~~~~~~~~

# అనంతయాత్ర

## శ్రీ రాగమాలిక రఘు రూప

కాలతలంపై
నిరంతరంగా పరిభ్రమించే సెకన్ల ముల్లు
అంతరంగపు లోతై
నిశ్శబ్దంలో మత్తుగా జపించే గుండె చప్పుడు
ఆ సాంధ్యవేళ కరగిపోయి
నా ఆకాశతెరపై
వొక గారడీగా వాలిన నక్షత్ర పూమాల
పారదర్శక రెక్కల్ని లోనికి ముడుచుకుని
కనుపాపలు స్వప్నలోకాల్లో
విరబిమ్మే వ్యక్తావ్యక్త రాగదీపాల చలిత కాంతి
నేననే స్పృహ సంకోచించి
మనోబిందువై
భౌతికానుభూతి తీరంనుండి వేరయి....
ఈ
అవ్యక్తపు టలలను విసిరే అదృశ్యకేంద్రం దిశగా
ఎదురీదుతూ....
— ఇది అనంతయాత్ర
~~~~~~~~~~~~~~~~~~~~

శ్రీ తురగా కృష్ణమూర్తి

# ఏఱువభీమ, మైలమభీమ - ఒకటి కాదు!

మైలమ భీముడు తమ వంశ పూర్వుడని చెప్పుకొను పూసపాటివారు చిక్కభీమ, మైలమభీమ, ఖండనభీమ, ఏఱువ భీమ, పరిచ్ఛేదిభీమ నామవ్యక్తులు ఒక్కరేయని విశ్వసించి గ్రంథస్థ మొనరించియున్నారు. ఆ సందర్భమున వారు చెప్పిన పద్యములివి.

సీ॥ అంబాతులిత మైలమాంబా సుతుడౌట
మైలమ భీమాఖ్య మలయుచుండె
భీమావహక్షోణి భీమాంచితుండౌట
భూమి మహోద్దామ భీముడయ్యె
దోరమౌ యేనుగు (ఏఱువ) దుర్గ పాలనమున
ఏఱువ భీమాఖ్య మీరుచుండె
నియమాభి రామత నిర్వటిల్లుచు జిక్క
చిక్క భీమాఖ్యచే చెన్ను మిగిలె

గీ॥ నిశిత ధారాధరంబుచే నశనిదుసిమె
బూర్వజితుడైన భల్లాణ భూమివరుడు
మరలరా వాని ద్రుంపక మహిమనాత్మ
భేద మొనరించుటను పరిచ్ఛేది యయ్యె

(నరస భూపాల రాజీయము)

సీ॥ జిక్క భీముండన బెంపెక్కె జన్మపువేళ
బహుబాంధవ ప్రేమ పాత్రమగుట
మైలమభీముడై మహి ప్రసిద్ధి వహించె
మైలమాంబికకు గుమారుడౌట
ఖండనభీముడన్ భవ్యనామము గాంచె
ఖండన శౌర్య ప్రచండుడౌట
ఏఱువభీముడై యిలకీర్తి విలసిల్లె
నెలమి నేఱువదుర్గ మేలుకొనుట

గీ॥ దండి మన్నీల మూకల గుండె దిగులు
బిడుగు తునకలు చేసిన బిరుదు మగడు
దేవపతితుల్య విభవుడు దేవవర్మ
నందనుండైన భీమ భూనాయకుండు.

(పూసపాటి తమ్మభూపతి కృష్ణవిజయం)

సీ॥ మైలమాంబికకు గుమారుండగుట నిల
మైలమభీమ సమాఖ్య గాంచె
ఖండనంబున భీమ బలమున మించుట
ఖండన భీమాఖ్య ప్రౌఢి మించె
నేఱువ దుర్గంబు నెలమి పాలించుట
నేఱువ భీముడన్ పేరు గల్గె
జిక్క భీమాఖ్య ప్రసిద్ధి వహించెను
మహితాభిజన నియమమును జేసి

గీ॥ యశని పొడిచేసి నిసితాసి నభ్రచరులు
వెరగుపడ దండభల్లాణు విజతు మరల
ననికివచ్చిన ద్రుంపక నాత్మతనువు
ఛేదన మొనర్చితా( బరిచ్ఛేది యయ్యె

(పూసపాటి వేంకటపతి ఉషాభ్యుదయము)

ఒకదానికొకటి ప్రతిరూపమున దగినట్లుగ నచ్చున గ్రుద్దినట్లుగ నున్న యీ పద్యములు పూసపాటి కవులు తమ వంశ పూర్వుడగు వాని ఆధిక్యతను వెల్లడించు యుద్దేశమునకే ప్రాధాన్యమిచ్చి చారిత్రక విషయముల పరామర్శించి ముందు వెనుకల కాలవ్యత్యాస నిర్ణయము పొంతబోక ఏఱువ భీముడు మైలమ భీముడు, చిక్క భీముడు, ఖండన భీముడు, పరిచ్ఛేది భీముడు యొక్కరే యని నిర్దేశించుచు నాతడే దేవవర్మ సుతుడైనట్లు వక్కాణించినారు. ఈ భీముల పరాక్రమముల వర్ణించుచు చాటువులు పెక్కు బయలుదేరినవి. ఆ పద్యములలో జిక్క భీముని గూర్చి 2 పద్యములు, ఖండన భీముని గూర్చి 1, ఏఱువ భీముని గూర్చి 3, మైలమ భీముని గూర్చి 9 పద్యములు ప్రసిద్ధములైనవి. జిక్క భీముని పై చెప్పిన పద్యములలో నాతడు పిడుగును నరకి తునియలు చేసిన యుదంతము ప్రస్తావింపబడి చిక్కభీముడే పరిచ్ఛేది భీముడగుట తెలుపబడినది. ఏఱువ భీముని గూర్చి చెప్పిన 3 పద్యములలో నొకటి చారిత్రక విషయ ప్రస్తావనము దెచ్చినది. ఇక మైలమ భీముని గూర్చి చెప్పబడిన 9 పద్యములలో ఒకదానిలోను చారిత్రకాంశముల ప్రసక్తి లేదు గాని అది వేములవాడ భీమకవి కృతమని చెప్పుటచే కొంత చారిత్రక వాసన

సంతరించుకొని వేములవాడ భీమకవి మైలమ భీముని సమకాలీను డను నిర్ణయము చేయ పరిశోధకుల నుత్సహించి తలపట్లు పట్టించుచున్నది. ఆ విషయమై వేరొక వ్యాసమున బ్రస్తా వింతును. ప్రస్తుతమున ఏఱువ భీమునిగూర్చి ఆతడు మైలమ భీముడగునా? కాదా? యనుటను గూర్చి విమర్శింప యత్నింతును.

"తోరమౌ ఏఱువ దుర్గ పాలనమున - ఏఱువ భీమాఖ్య మీరుచుండె"; "ఏఱువ భీముడై యిలగీర్తి విలసిల్లె నెలమి ఏఱువ దుర్గ మేలుకొనుట;" "ఏఱువ దుర్గంబు నెలమి పాలించుట నేఱువ భీముడన్ పేరుగల్గె"; ఈ పై పద్యములలోనున్న చారిత్రకాంశ మొక్కటే! అదేమన - ప్రసక్తవ్యక్తి ఏఱువ దుర్గాధిపత్యము వహించి పాలించెననుటయే! అయితే ఈ ఏఱువ దుర్గాధిపత్య మాతనికెట్లు ప్రాప్తించినది? ఇది పూర్వార్జితమా? అయిన ఆతని పూర్వీకులెవరు? వారి కాలమెద్ది? ఇత్యాది ప్రశ్న లుత్పన్న మగును. వీనికి సదుత్తరము లీయవలసియున్నది.

పశ్చిమ చాళుక్యుల పాలనా కాలమున నల్లగొండతో కలుపు కొని తెలంగాణమందు పెక్కు మాండలిక రాజ్యములు సంపా దించి, సామంతులుగా రాజ్యము చేసినవారు తెలుగుచోడులే! కావేరీ నదీతీర ప్రాంతములనుండి వచ్చిన ఈ వంశస్థులు సూర్య వంశోద్భవులు. కరికాలచోడ వంశ్యులు. క్రీ॥శ॥ 6వ శతాబ్దము నుండియు ఈ వంశస్థులు తెలుగుదేశములోనికి వలస వచ్చి, తమ పరాక్రమ శౌర్య ప్రతాపములచే పెక్కు మాండలికములు సంపాదించి పరిపాలించిరి. కృష్ణానదిని దాటి తెలంగాణములో స్థిరపడిన చోడశాఖవారికి తెలుగుచోడులని ప్రసిద్ధి కల్గినది. అందులో ఏఱువ వంశమునకు చెందిన తెలుగుచోడ శాఖయొకటి ఇటు తెలంగాణమునందును అటు కృష్ణకావలను మిక్కిలి ప్రాము ఖ్యమునకు వచ్చినది.

తెలుగుచోడులు మొదట నల్లగొండ జిల్లాలోని ఏలేశ్వరము ప్రాంతములపై అధికారము సంపాదించి క్రమముగ దానిని కన్నెనాడు లేక కందూరునాడు అని పిలువబడు మహబూబ్‌నగర జిల్లాకు విస్తరించి దానితోపాటు కొలనుపాక, కొండపల్లినాడులు సంపాదించి ముఖ్యస్థలమైన పానుగల్లు-నల్లగొండ పట్టణములో తమ రాజధానిని స్థిరపరచి "ఏఱువ సింహాసన"మని పేరుపెట్టిరి. అందువలన కందుకూరు, కొలనుపాక, కొండపల్లి ప్రాంతము లన్నియు "ఏఱువనాడు"గ యేర్పడి ఆయా ప్రాంతముల నేలు చోడులకు ఏఱువ నామము విశేషణముగ వాడుచు వచ్చిరి.

అట్లుగా యేర్పడిన ఏఱువ విషయము బ్రహ్మరాక్షస గండపెండేర గంగయసాహిణి (కాయస్థుడు) మహామండలము లోనిది. ఈ గంగయసాహిణి హైదరాబాదు రాజ్యములో నల్లగొండ జిల్లాలోని పానుగల్లు మొదలు మార్జవాడివరకు గల తెలుగు దేశమునంతను పరిపాలన చేసెను. కడప మండలములోని పులివెందుల తాలూకాలోని మోపూరు మొదలుకొని మైసూరు రాజ్యములోని చింతామణి తాలూకాలోని మిండిగల్లు వరకు గల ప్రదేశమునకు "మార్జవాడిదేశ మహారాజపది" యను నామము గలదు. మార్జవాడికి "కైవారకోట" యను నామాంతరమున్నది. ఈనాడుకు "వల్లూరు" పట్టణము రాజధానిగ నుండెను. ఈ విశాల ప్రాంతముపై గంగయ అధికారము చెల్లుబడి యగుచుండ కాకతి గణపతి రాజప్రతినిధిగ మారిన గంగయ కడప, కందనోలు (కర్నూలు), అనంతపురం, బళ్లారి, నెల్లూరు, గుంటూరు మండలములపై సర్వాధికారియై పరిపాలించెనని యనేక శాసనములబట్టి నిర్ధారితమగుచున్నది.

గంగయసాహిణి కాకతి గణపతిచే నోడింపబడి ఆతని ప్రతినిధిగ, సైన్యాధ్యక్షునిగ, సామంతునిగ గణపతి కొలువు చేయుటెట్లు సంభవించినదో ఇచట వివరించుటప్రస్తుతము. ఆ సంఘటన క్రీ॥శ॥ 1247వ సంవత్సరముననో ఆ తర్వాత కొద్దికాలమునకో జరిగియుండును.

కాకతి గణపతిదేవ చక్రవర్తి గండికోట, ములికినాడు, రేనాడు, పెనగాడి, పెదగల్లు, సకిలినాడు, ఏఱువనాడు, పొత్తపి నాడు మొదలగు సీమలనెల్ల జయించి గంగయదేవ మహారాజును తనకు సైన్యాధ్యక్షునిగ నుండి యాతడు తనకు ప్రతినిధిగ పై సీమలనెల్ల పాలించునట్లు గణపతి యనుజ్ఞ యొసగెను. అప్పటి నుండియు గంగయ సర్వాధికారియై సైన్యాధ్యక్షుడై ప్రతినిధి పాలకుడై మిగుల వాసి గాంచెను. గణపతిదేవ చక్రవర్తికి లోబడిన సామంతరాజుల నెల్లర ననుశాసించి యదుపులో నుంచి ప్రఖ్యాతుడైనందున గంగయ సాహిణికిం మాండలికబ్రహ్మ రాక్షసుడనియు, రక్కెస గంగనియుం బేరులు వచ్చెను. ఆ కాలమున నాంధ్రచక్రవర్తి గణపతిదేవుని రాష్ట్రింబును డెబ్బది రెండు వినియోగంబులవారు గలరు. వారలకెల్ల నీ గంగయ సాహిణి అధిపతి గావున "బాహత్తరి నియోగాధిపతి" యను బిరుదము వహించెను.

పశ్చిమ చాళుక్య ప్రభువుల అండదండలతో నేఱువ విషయములోని పానుగల్లు ప్రాంతమును పాలించినవారు వల్లభచోడ మహారాజులు (966 ఎ.డి) ఇరుగనచోడ మహారాజు (1C67ఎ.డి)

బద్దెనచోడ మహారాజు (1067-1073 ఎ.డి) బద్దెనచోడ మహారాజు పిదప నెవ్వరు రాజ్యమునకు వచ్చిరో తెలియవచ్చుట లేదు. కాని - ఏఱువ తొండయరాజు పానుగంటిని పరిపాలించిన మొదటి రాజని చెప్పబడుచున్నది. అదెట్లనిన:- ఏఱువ తొండయరాజు భార్య మైలమ దక్షారామ శాసనమున నాతడు పశ్చిమ చాళుక్య విక్రమాదిత్య 6 సామంతుడని తెలియుచున్నది. శ్రీ తేరాల సత్యనారాయణశర్మగారు తమ "ఏఱువ సింహాసనము - నల్లగొండ జిల్లా" యను వ్యాసమున (1973 మే నెల భారతి) తొండయ రాజునకు పూర్వులు ముగ్గురు క్రీ॥శ॥ 966 నుండి క్రీ॥శ॥ 1073 వరకు ఏఱువ నేలిరని చెప్పియున్నారు. ఆ పిదప తొండయరాజు రాజ్యమునకు వచ్చెను. తొండయరాజునకు పై ముప్వురు రాజులకు మధ్య గల సంబంధము తెలియదు. ఆ వంశములో తొండయరాజు మొట్టమొదటివానిగా గుర్తించుట జరుగుచున్నదని స్పష్టీకరించియున్నారు. మరియు నీ తొండయరాజు పశ్చిమ చాళుక్యరాజైన ఆరవ విక్రమాదిత్యుని వలన క్రీ॥శ॥ 1076లో కొలనుపాక ఏడువేలునాడును పానుగంటిని పరిపాలింప నధికారము పొంది నటుల తెలిపియున్నారు. ఈ వక్కాణమునకు వారు శాసన ప్రమాణము చూపుచున్నారు. తొండయరాజు తుది శాసనము క్రీ॥శ॥ 1088 లోనిది.

ఈ ప్రకారము క్రీ॥శ॥ 1073 వరకు ఏఱువ నేలిన బద్దెనచోడ మహారాజునకు పిదప అత్యంత సన్నిహిత కాలమందు అనగా క్రీ॥శ॥ 1076లో తొండయరాజు ఏఱువ సింహాసన మధిష్ఠించెనని తేలుచున్నది.

ఏఱువ తొండయరాజు తుది శాసనము క్రీ॥శ॥ 1088 నాటిదైనను ఆతడు క్రీ॥శ॥ 1124 వరకు జీవించియున్నట్లు తలంపబడుచున్నది. ఈతడు ఆరవ విక్రమాదిత్య చక్రవర్తి మహాప్రధాని అనంతపాలయ్యతో కలసి వేంగీ దండయాత్రలో క్రీ॥శ॥ 1123-1124 సంవత్సరమున పాల్గొనినట్లు శాసనాధార మున్నది. (యస్.ఐ.ఐ. వాల్యూం. 4. నెం. 1212) ఆ విధిని తొండయరాజు ఏఱువ విషయమును క్రీ॥శ॥ 1076 నుండి క్రీ॥శ॥ 1124 వరకు 48 సంవత్సరములు పాలించినట్లు తేలుచున్నది. ఆరవ విక్రమాదిత్యుడు క్రీ॥శ॥ 1126లో మరణించెను.

క్రీ॥శ॥ 1126-27లో విక్రమాదిత్య చక్రవర్తి 6 మరణించిన పిదప కుంతల చాళుక్య సామంతుడైన కాకతి ప్రోలరాజు స్వతంత్రుడై ప్రత్యేక సామ్రాజ్యము నెలకొల్పి పరిపాలింపవలె నని యత్నించుచు బలహీనులగు ప్రక్క మాండలికులపై దండెత్తి జయించుచు క్రమక్రమముగ బలము పుంజుకొను చుండెను. క్రీ॥శ॥ 1127 నుండి 1138 వరకు భూలోకమల్ల బిరుదాంకితుడు మూడవ సోమేశ్వరుడు, వాని తర్వాత రెండవ జగదేకమల్లుడు క్రీ॥శ॥ 1148 వరకు, నాతని పిమ్మట త్రైలోక్యమల్ల బిరుదాంకితుడు మూడవ తైలపుడు కుంతలరాజ్య పాలన మొనర్చి కాకతి ప్రోలరాజు క్రీ॥శ॥ 1158లో మరణించగా నాతని కుమారుడు రుద్రదేవుడు సింహాసనమెక్కి హతశేషులైన మాండలికుల నెల్ల జయించి క్రీ॥శ॥ 1162 సంవత్సరము నాటికి తన సామ్రాజ్యమును విస్తరింపజేసికొనెను. ఆ సంవత్సరముననే తైలపుని సైన్యాధ్యక్షుడు "కలచురి బజ్జన" స్వామిద్రోహియై, తైలపునిపై తిరుగుబాటొనరించి రాజ్యమును హస్తగత మొనర్చుకొనెను.

బలమైన కుంతలరాజ్య మట్లు బలహీనమై వారి సామంతులగు తెనుగుచోడులు పట్టుతప్పి నిర్వీర్యులైరి. 11వ శతాబ్ది నుండి తెలుగుచోడులలో నొక శాఖ పశ్చిమ చాళుక్య చక్రవర్తులకు సామంత మాండలికులుగ నుండి వర్ధమానపురము, కందూరు (ఏఱువ) పానుగల్లు మొదలగు ప్రదేశములను పాలించుచుండిరని ఇదివరలో చెప్పియుంటిని. అయ్యవి ఇప్పటి హైదరాబాదు రాష్ట్రమునందలి మహబూబ్‌నగర్ నల్గొండ జిల్లా ప్రాంతము లోనివి. వర్ధమానపురము, కందూరు, పానుగల్లు దుర్గములు మాండలిక రాజులకాయా కాలములందు రాజధానులుగ నుండుచు వచ్చెను. కుంతల చాళుక్య ప్రభువు తైలపుని సంతతివారీ చోడులను జయించి, తమ ప్రతినిధులుగ నక్కడి దేశములను పాలించుటకు నియమించినపుడు వారలు తరచుగ "కోడూరు" రాజధానిగ జేసికొని పాలించుచుండెడివారు. చోడ మాండలికులు వారికి లోబడి యాయా దుర్గముల కధిపతులై పరిపాలన చేయుచుండెడివారు.

క్రీ॥శ॥ 1162వ సంవత్సరములో తైలపదేవ చక్రవర్తి కల్యాణ కటకమును గోల్పోయిన పిదప పానుగల్లు దుర్గాధీశుడు ఉదయరాజు స్వతంత్రుడగుటకు ప్రయత్నించెను. ఈ ఉదయ రాజు పాలనలోనే పండిత మల్లికార్జునుడు రాజుచే నవమానితుడై పానుగంటిని శపించి వెడలిపోయెను. ఇది క్రీ॥శ॥ 1162వ సంవత్సరమున జరిగియుండెనని శాసనములు తెలుపుచున్నవి.

పానుగల్లులోనున్న ఒక శాసనమునుబట్టి ఏఱువ తొండయ-మైలమ దేవులకు ఉదయనచోడ, భీమచోడ, గోకర్ణచోడులను ముప్వురు పుత్రులున్నట్లు తెలుపబడినది. శ్రీ సత్యనారాయణ శర్మగారు ఆ వంశవృక్షము నిట్లు రూపొందించినారు.




ఈ పై వంశవృక్షమును దక్షారామమునందలి మైలాంబికా దేవి శాసనమునుబట్టి తొండయరాజు మైలమాంబల సుతత్రయములో ద్వితీయుడు భీమయే మైలమ భీముడగుచున్నాడు. చాటువులలో నెక్కడను ఆతని భార్య దీనమ్మదేవి యని చెప్పబడియుండ లేదు. అదియునుగాక దీనమ్మ నల్లభీముని భార్య యగుచో నామె మైలమభీముని భార్యయగుట పొసగదు. నల్లభీముడు మైలమ భీముడు భిన్న వ్యక్తులని చరిత్ర చెప్పుచున్నది. అందుచే మైలమ భీముడన్న మైలమ సుతుడనుటే సంభవము. ఏ ఆధారమును పురస్కరించుకొని శర్మగారు మైలమ భీముని నల్లభీముడన్నారో గ్రాహ్యముగుట లేదు. మైలమభీమన, నల్లభీములు ఒకటి కాదని వేర్వేరు వ్యక్తులని రామచంద్రన్, డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారలు అభిప్రాయపడిరి. అదియే సరియగునని అంగీకరింపక తప్పదు.

మైలమ భీముడు తొండయరాజు - మైలాంబికల కుమారుడని నిర్ణయించుకొనవచ్చును.

(మరింత విషయ విశదీకరణకు మార్చి 1989 భారతిలో ప్రచురించిన నా వ్యాసాన్ని పరిశీలించవచ్చు.)

# ఓ సరస్వతీ!

## శ్రీ దాశరథుల బాలయ్య

బరువు బరువుగా హృదయము మరిగినపుడు
మనసు చెదరగా నిద్దుర మరచినపుడు
పొరలి పొరలి కన్నీళులు కురిసినపుడు
ఓ సరస్వతీ! నీవు నన్నూరడింతు!

వాడిపోయిన తీగెకు మ్రోడులకును
చితికిపోయిన దుఃఖ జీవితములకును
తావకీన పదాబ్జ సుందర దళముల
ఛాయలోనగూర్చు తీరని హాయి నిజము!

నాదు హృదయమ్ములో నీవు కదలగానె
ఏవొ కమ్మని తావులు నేవొ మధువు
లేవొ పున్నమరేలు మరేవొ మంచు
చినుకు లగుపించు మురిపించు చిత్తమలర-

మామకీన జీవితపు టారామ మందు
వైజయంతీ పరీమళ వైభవములు
కలుగజేయుము బ్రతుకును వెలుగజేయు
మో సరస్వతీ! నీకు నమోస్తు సతము!

# కలగూరగంప

## శ్రీమద్రామాయణము-
## నామ రామణీయకము

"కూజంతం రామ రామేతి
మధురం మధు రాక్షరమ్
ఆరూహ్య కవితా శాఖాం
వందే వాల్మీకి కోకిలమ్"

'అది ఒక పవిత్ర తపోవని. అందనేక మహావృక్షములు. కొన్ని వేదాశ్వత్థములు. మఱికొన్ని శాస్త్ర మహావటములు. కాని అందున్నది ఒకేఒక్క కవితా రసాలము. ఆ ఆమ్రశాఖిక పై వాల్మీకి యనెడి కోకిల మధిష్ఠించి మనోజ్ఞముగ, మధురాక్షరములతో మధురాతిమధురముగ "రామ రామ" యని అపురూపముగ గానము చేయుచున్నది! ఆ కోకిల స్వామికి నమస్సు మనస్సులని-ఆదికవి [వాల్మీకి]కి అంజలి కైచేసి ధన్యుఁడైనాఁడు ఓ కవి మూర్ధన్యుడు.

వాల్మీకి కవికోకిల కషాయ కలకంఠ కాకలీధ్వనితో వైదిక వాఙ్మయోద్యాన వనమునకు వసంతోదయమైనది. వేద కవితా కాసారములైన క్రౌంచిగరులే ఆ కోకిల స్వామికి క్రొత్త గొంతుకను ప్రసాదించినవి. కవితా మాకందపు పుణ్యములు పూచినవి. అంతదనుకను నిత్య పరిచితములైన శబ్దములును, అర్థములును దాని ముఖమునఁబడి రసప్లావితములై క్రొంగ్రొత్త రూపమును సంతరించుకొనినవి.

"వేద వేద్యే పరే పుంసి
జాతే దశరథా త్మజే
వేదః ప్రాచేతసా దాసీత్
సాక్షాత్ రామాయణాత్మనా"

శ్రీమద్రామాయణము వేదసమ్మతము, ["ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్" -వా.రా. 1-1-97] పరమ పురుషుడగు శ్రీమన్నారాయణుఁడు దశరథాత్మజుఁడగు శ్రీరాముఁడుగ నవతరింపగనే పరమాత్మ గుణవర్ణనైక పరాయణమగు వేదము వాల్మీకి మహర్షి ముఖమున శ్రీమద్రామాయణ రూపమున వెలువడినది.

ప్రప్రథమముగ లౌకిక సంస్కృత భాషలో వెలువడిన ఈ మహాకావ్యము ప్రాచేతసుఁడయిన వాల్మీకి ప్రపంచమునకు ప్రసాదించిన ప్రాగ్భారతి. వేదము రామాయణముగా నవతరించుట, అతఃపూర్వము లేని లౌకిక ఛందో వివర్తపు టవతరణము - రామావతారముతో కలిగిన మఱి రెండవతారములు. దీనితో ఆధ్యాత్మికమైన ఆనంద చేతనమునుండి రసాత్మకమైన రామకథామృత మవతరించినది. ఋషినుండి కవి పుట్టినాఁడు. పరమ పురుషునినుండి పరిపూర్ణ మానవుఁ డవతరించినాఁడు. సత్యదర్శనము నుండి సత్కావ్య ముదయించినది. లోకమున నాదికావ్య మవతరించినది. [తెలుగులో రామకవులు పుట-1] దీనినే "వాల్మీకి పాదశ్చ సునర్ఘపద్మ" మ్మని యశ్వఘోషుఁడు "స్వకృతిం గాపయామాస కవి ప్రథమ పద్ధతి" మ్మని కవికుల గురువు కాళిదాసు; "అథ భగవాన్ ప్రాచేతసః ప్రథమ మనుష్యేషు శబ్ద బ్రహ్మణాం, తాదృశం వివర్త మితిహాసం రామాయణం ప్రణీతాయ" అని భవభూతియు ప్రస్తుతించిరి.

ఇట్టి రామాయణ కావ్యనామము కమనీయము, రమణీయము, గూఢార్థ ద్యోతకము, ఇతివృత్త సూచకము, అక్షర రమ్యతా శోభితము. అసలు కావ్యనామకరణములో కవులనుసరించు ధోరణులను కుంతకుఁడు తన "వక్రోక్తి జీవితము" నందిట్లు నిర్దేశించినాఁడు.

"అస్తాం వస్తుషు వైదగ్ధ్యం
కావ్యే కామపి వక్రతాం
ప్రధాన సంవిధానాంక
నామ్నాఽపి కురుతే కవిః"

కవులు ఇతివృత్త సూచనము, చమత్కృతి, ఉచ్చారణ సౌలభ్యము, అక్షర రమ్యత, సంకేత గూఢార్థములు, రమణీయత యను గుణములను మనసునందిడుకొని కావ్యములకు నామకరణము చేయుదురు. తల్లిదండ్రులు తమ సంతానమునకు నామకరణము చేయుటలో ఎంతయో ఆలోచన మొనర్చి చమత్కృతీ సామంజస్యములు నిర్దేశించుచుండగ, సప్త సంతానములలో ప్రచుర పచార ప్రశస్తి గన్న కావ్య నామకరణములో కవి తీసికొను జాగరూకతను, పడు అవస్థను గుర్తించవలసిన యావశ్యకత యెంతయేనియు కలదు.

సాధారణముగ కావ్యశీర్షిక గుణము లన్నింటిని సంపూర్ణముగ గుర్తుఁగొనియుండక పోవచ్చును. కవి ప్రతిభా, మనోధర్మములఁబట్టి కొన్నింటినే కలిగియుండవచ్చును. ఉదాహరణమునకు "ప్రభావతీ ప్రద్యుమ్నము", "జాంబవతీ పరిణయ" కావ్యనామములు యితివృత్తసూచకములు. "ప్రతిమ" "ముద్రారాక్షసము" "మృచ్ఛకటికము" "ఆముక్త మాల్యద" లందు చమత్కృతి విశిష్ఠ గుణము. "మను చరిత్ర" "వసు చరిత్ర" లందు ఉచ్ఛారణా సౌలభ్యమధికము. "రాధా మాధవము" "గీత గోవిందము" లందు అక్షర రమ్యతా రామణీయకత లున్నవి. "అభిజ్ఞాన శాకుంతలము" "కళాపూర్ణోదయము" లందు అన్ని గుణములును శోభించినవి. ఇట్లే "శ్రీమద్రామాయణము"ను నామౌచిత్య విషయమున సర్వగుణ సంశోభితము.

"రామ+ఆయన" - [సవర్ణదీర్ఘ సంధి - అకస్సవర్ణేదీర్ఘః 6-1-101]చే "రామాయన" మగును. "పూర్వ పదాత్సంజ్ఞాయామగః, రషాభ్యాంనోణస్సమాన పదే" అను శాస్త్రవిధిచే 'రామాయణ' మయ్యెను. 'రామస్య అయనం' రాముని యొక్క అయనము అని దీనికి విగ్రహము చెప్పుకొనిన ఇది షష్ఠీ తత్పురుష సమాసము. "స్వతంత్రముగా కర్తృత్వమును గాని, భోక్తృత్వమును గాని సమర్థించగల రెండు నామరూపములకు అవినాభావ సంబంధమును కూర్చుటయే షష్ఠీ విభక్తి సాధించు ప్రత్యయ పరమార్థము". ఇట్టి విభక్తితో నేర్పడిన తత్పురుష సమాసము 'రామాయణము'. "రామ" శబ్దము '"రమ' అను ధాతువు నుండి యేర్పడినది. దీనికి రమించుట, ఆనందపడుట, ఆనందపెట్టుట, హాయిని గొల్పుట అని అర్థము. 'అయన శబ్దము' 'ఇ' ధాతు నిష్పన్నము. దీనికి కదలుట, నడచుట, పయనించుట అని అర్థము కనుక రామాయణ మన శ్రీరాముని చలనము లేక గమనము లేక స్పందనము అని అర్థము. అంతే కాదు, "ఈయతేఽప్రాప్యతే పురుషార్థః అనేన ఇతి అయనమ్" అని ఆయన శబ్దవ్యుత్పత్తి పురుషార్థమును సంపాదించిపెట్టు చక్కని ప్రవర్తనమును అయన మని భావింపవచ్చును. 'రామస్య అయనమ్ రామాయణమ్' రామాయణము ఇతివృత్తిసూచక మాత్రముగ కేవల రామకథను కాక, రాముని అయనమును సూచించునదిని ఫలితార్థము రామ శబ్దములోని రమణీయతను, అయన శబ్దము కమనీయమగు గమనమును వేగమును సమకూర్చినది. శ్రీరాముఁడు జనించినది మొదలు పట్టాభిషేకము వఱకు ఆయన జీవితములో ఈ అయనత్వము నిరంతర, నిర్విరామ, నియమనిష్ఠ - కన్పించును. జీవితములో నొక్క క్షణము కూడ స్థాయి, హాయి లేక కదలేవి ఇడుములు బడయుచు; సత్య ధర్మచ్యుతి యొనర్పక సాగిన రాముని జీవనయాత్ర ఒక గొప్ప అయనము, అందులకే అది రామాయణము.

రామాయణ మహాయనములో కేవలము రాముని యొక్క అయనమే కాదు. రామా [సీత] యొక్క అయనము కూడ ఇతోధికమే! 'రామా అయనం' కూడ రామాయణమే యగును. సీతాదేవిని వాల్మీకి అనేక సందర్భములలో 'రామా' శబ్దముతో సూచించినాఁడు. ఉదాహరణమునకు, అప్పుడప్పుడే అడవులలో ఆడుతూ పాడుతూ తిరుగుచున్న సీతాదేవిని గుఱించి సుమంతుడు కలతనొందిన కౌసల్యతో నిటుల చెప్పినట్లు వాల్మీకి వర్ణనము.

"భాలేవ రమతే సీతాఽ బాలచంద్రనిభాననా
రామా రామే హ్యధీనాత్మా విజనేఽపి వనే సతి".

[అయోధ్యా కాండము, సర్గ 60. శ్లో 10]

రాముని జీవిత భాగస్వామినిగ, సహధర్మచారిణిగ "రామా" [సీత] యొక్క అయనమును యిందు కలదు. కనుక "రామాయాః అయనం" అని కూడ చెప్పుకొనవచ్చును. ['రమయా ఇదం రామమ్' అని రామాయణ సారోద్ధారము ఉత్తరకాండపు భూమిక యందుల్లేఖితము]. మఱియు-

"రామా యన చపలాక్షుల పేరు
రామ యన బ్రహ్మమునకు పేరు"

అను నాదముని, త్యాగరాజు కీర్తన యందును - రామా శబ్దము అందమైన స్త్రీ యను నర్థమున, ప్రయుక్తము, సీతాదేవిని రామాభిధానముతో వ్యవహరించుటలో నెంతయో సామంజస్యము కన్పట్టును. సీతాదేవికి మఱియు రామచంద్రునకు పేరులోనే కాదు; తీరుతీయములందును గూడ నభేదము గలదు చూడుఁడు. అశోకవనమున సీతాదేవిని గాంచిన హనుమంతుడు తన మనసున ననుకొన్న మాటలివి.

"అస్యా దేవ్యా యధారూప మంగ ప్రత్యంగ సౌష్టవం
రామస్య చ యధారూపం తస్యేయ మసితేక్షణ"

[సుందర కాండము సర్గ. శ్లో. 60]

[ఈమె శరీరాకృతిఁ బోలు ఆకృతిని రాముఁడును, రాముని యవయవముల చక్కని యమరిక నామెయు గలిగి, ఒకరికొకరు తగియున్నారు]. సీతారాముల మధ్యగల యీ అన్యోన్యత్వమును, అభిన్నత్వమును, అనుబంధమును అక్షర రూపమున నిరూపించుటయే రామాయణ పరమావధిగ భావింపవచ్చును. రామాయణము నందలి అద్వైత రససిద్ధి కిదియే ప్రత్యక్ష ప్రమాణము.

'రామాచ రామశ్చ రామౌ రామయోః అయనం' అని విగ్రహ వాక్యము చెప్పుకొనిన పరమ సుందరులగు సీతారాముల చరితము నభివ్యక్తము చేయుచున్నది కాన రామాయణమయ్యెను.

ఇంకను "రమయతి సర్వాన్ గుణైరితి రామ" అను వ్యుత్పత్తి ననుసరించి గుణములచేత జనులందఱు ఎవనియందు ఆనందించుచుందురో అట్టివాఁడు రాముడు అని రామ శబ్దమున కర్థము "రామ రహస్యోపనిషత్తు"లో,

"రామ ఏవ పరం బ్రహ్మం రామ ఏవ పరం తపః
రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మతారకం"

అనియును; "రామ తాపిన్యుపనిషత్తు"లో

"రమంతే యోగినోఽ నన్తే నిత్యానందే చిదాత్మని
ఇతిరామ పదే నాసౌ పరం బ్రహ్మాభి ధీయతే"

అనియును;

"సదా రామోఽహ మస్మీతి తత్త్వతః ప్రవదంతియే
నతే సంసారిణీ మానం రామ న సంశయః

రమన్తె యోగినోఽత్రేతి వ్యుత్పత్త్యా అన్తర్యామీ-తస్యాయనం చిత్తశుద్ధి ద్వారా ప్రాపకం తప్రితి పాదకత్వాత్-ఇతి అధ్యాత్మ రామాయణమ్.

"శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్ర నామ తత్తుల్యం రామనామ వరాననే"

అని శ్రీరామ నామ మహాత్మ్యము వివరింపఁ బడినది. అట్టి రామునియొక్క అయనము శ్రీమద్రామాయణము.

"రామ మయతి ప్రాపయతీతి వా; "రామస్య అయనం స్థాన మితి" వా; "రామః అయ్యతే ప్రాప్యతే అనే నేతి" వా; "రామ మయతీతి జ్ఞాపయతీతి" వా; రామాయణ మిత్యాదిః వ్యుత్పత్తిభిః శ్రీరామాఖ్య పరబ్రహ్మ జిజ్ఞాసా పూర్వకం శ్రీరామ బ్రహ్మజ్ఞానా త్కైవల్య ప్రాప్తి రితి తత్సాధనోపాయ ప్రతిపాదన గ్రంథో రామాయణ మితి చ నిద్యతి" అని "రామాయణ సారోద్ధరము"న [బాలకాండ పీఠిక, పుట 8] రామాయణ శబ్ద విచారము సుష్ఠుగ జరిగినది.

రాముని ప్రాప్తింపఁ జేయునది లేక జ్ఞాపకము చేయుచున్నది కనుక రామాయణమని యొక అభిప్రాయము మఱియు 'రా' యన ప్రపంచమనియు, 'మ' యన నీశ్వరుఁడనియు 'రామ' శబ్దమునకు వేఱొక నిర్వచనము క్రింది శ్లోకమున గన్పట్టును.

"రా శబ్దో విశ్వవచనో, మశ్చాపీశ్వర వాచకః
విశ్వాధనేశ్వరో యోహి, తేన రామః ప్రకీర్తితః"

ఇంతియే కాదు ఆసలు రామ శబ్ద అక్షరద్వయ సిద్ధిని పెక్కురు విజ్ఞులిట్లు వివరింతురు. వైష్ణవ మంత్రములలో 'అష్టాక్షరి' ప్రధానము శైవులకు 'పంచాక్షరి'ని మించిన ప్రసిద్ధమంత్రము మఱేదియును లేదు.

ఓం నమో నారాయణాయ [అష్టాక్షరి]
ఓం నమః శివాయః [పంచాక్షరి]

"నాయనాయ యదృతేఽ క్షరాష్టకమ్
పంచకంచ న శివాయ యద్వినా
యుద్ద్వయమ్ భవతి ముక్తి హేత మే
తద్ద్వయమ్ వయ ముపాస్మహేఽద్వయమ్."

అను శ్లోకము సుప్రసిద్ధము. ఇట్లు రామ శబ్దము అష్టాక్షరీ, పంచాక్షరీ మంత్రములలో దాగియున్నది. 'రామ' శబ్దము. అష్టాక్షరిలో 'రా' ప్రధానము. 'రా'ను తొలగించిన నాయనాయ [న అయనము] మోక్షము కొఱకు కాదను విపరీతార్థము సిద్ధించును. అట్లే పంచాక్షరిలో "మః" తొలగించిన 'న శివాయ' - శివము కొఱకు గాదను నశుభార్థము కలుగును. ఆ రెండక్షరములను గూర్చిన "రామః" శబ్ద మేర్పడుచున్నది అనగా 'రామ' శబ్దము హరి హరా భేద తత్త్వ ప్రబోధకమని సారార్థము. అట్టి రామ చరిత్రము వర్ణ్యముగా గలది రామాయణము.

ఇంకను ఆధ్యాత్మవిదులు "తత్త్వమసి" అను మహా కావ్యము యొక్క అర్థము "రామ" అను రెండక్షరములలో నిండియున్నదని వ్యాఖ్యానింతురు. 'రా' అనగా "తత్" అని అర్థము. 'మ' అనగా "త్వమ్" అని అర్థము. ఆ రెండక్షరముల సంయోజనమే [అసి] "తత్త్వమసి" ఇట్లు "రామ" అను శబ్దములో ఆ మహావాక్యార్థమంతయు ఇమిడియున్నదందురు.

"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితమ్ మహత్
పౌలస్త్యవధ మిత్యేవ చరిత వ్రతః"

[బాలకాండ అధ్యా-4 శ్లో-7]

అని వాల్మీకి రామాయణముననే పేర్కొనఁబడినది. "రామస్య అయనం స్థానం రామాయణమ్". లోకోత్తర గుణోత్తముఁడగు శ్రీరామచంద్రుని యాదర్శ చరిత్రమును వర్ణించుటచే నమ్మహాకావ్యము శ్రీమద్రామాయణమనియు; తన సౌశీల్య సచ్చారిత్రములచే నాదర్శభూతయై, సకల సద్గుణములకును కాణాచి

యైన సతీ తిలకమగు సీతాదేవి పూత చరితమును వర్ణించుటచే "సీతాయాశ్చరితమ్" [సీతాచరితము] అనియును; 'శ్రీమద్రామాయణ మపిపరం ప్రాణితి త్వచ్చరిత్రే' "మద్యాహ్నే శ్రీ ప్రసంగతః" - ఇత్యాది వచనములను సీతాచరిత ప్రాధాన్య సూచకములే! రాముని కథకును, రావణుని వధకును మధ్యగ సీతాచరిత ముండుట ఈ నామమును అన్వర్థ మొనరించుచున్నది. రామాయణము మొత్తము కావ్యమనియు, సీతాచరిత స్వరూప మైనందున నది మహాకావ్యమైనదనియు ఆర్యుల అభివర్ణనము. గొప్పదియగు సీతాచరితము కనుకనే రామాయణము సమగ్రతను సంతరించుకొనినదని అన్యుల అభిభాషణము. ధర్మము నణగింపఁజేయుటయే వృత్తిగా నెంచి మదోన్మత్తుఁడై దీన సాధ్వీ-సాధు జనులను అహరహము బాధించుచు అధర్మ మార్గమున చరించు త్రిలోక కంటకుడగు రావణుని వధను వర్ణించుట ద్వారమున విశ్వ శ్రేయస్సు ప్రతిష్ఠాపక మగుటవలన రామాయణము "పౌలస్త్య వధ" మనియును వ్యవహృతము.

ఇంకను శ్రీమద్రామాయణము తంత్రి, లయ సమన్వితమై గాన యోగ్యమగుటచే "గీత" మని చెప్పడినది.

"అభిగీత మిదమ్ గీతమ్"

[బాలకాండ అధ్యా-4. శ్లో-27]

"పాఠ్యే గేయేచ మధురం ప్రమాణై స్త్రిభిరన్వితమ్
జాతి భిస్సప్త భిర్బద్ధం తంత్రీలయ సమన్వితమ్
రసై శ్శృంగార కారుణ్య హాస్యవీర భయానకైః
రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్యమే తదగాయతమ్".

[బాల. 4-8, 9]

మనోహరముగ పఠించుటకు, సప్తస్వర యుక్తముగా పాడుటకు ననువుగానుండి నవరసములను పోషించుచూ కుశలవులు రామాయణ కావ్యమును గానము చేసిరని వాల్మీకి మాట. ఏదైన ఒక విషయము ప్రచారము చేయవలయుననిన అది ఖేలనా యోగ్యమై, రాగతాళములతో అభినయావకాశముతో నున్న అట్టిది శీఘ్రముగ పూజా కర్షక మగుననుటకు రామాయణము చక్కని నిదర్శనము. అందువలననే రామాయణమును 'గీత' మనుట సార్థకము.

రఘువర చరిత్రమును వర్ణించుటతోబాటుగ ధర్మార్థ కామ మోక్ష రూపములగు చతుర్విధ పురుషార్థములను వర్ణించుటచేత నిది "ఇతిహాస" మనియు పేర్కొనఁబడినది.

"ధర్మార్థ కామ మోక్షణా ముపదేశ సమన్వితమ్
పూర్వవృత్త కాథాయుక్త మితిహాసం ప్రచక్షతే"

[శబ్ద కల్పద్రుమము]

అని ఇతిహాస లక్షణము నిర్దేశింపఁబడినది.

శ్రీమద్రామాయణ మొక పవిత్ర గ్రంథముగ భారతీయులచే తరతరములుగ నారాధింపఁబడుచున్నది. పారాయణము చేయ బడుచున్నది. తన్నిదర్శనమీ శ్లోకము.

"చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్
శృణ్వన్ రామాయణం భక్త్యాయః పాదం పదమేవ వా
సయాతి బ్రాహ్మణ స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా"

[శ్రీరాముని చరిత్రము] బ్రహ్మాది లోకములలో [అనేక కోట్ల?] శ్లోకములలో విస్తృతము. [వాల్మీకి మహర్షి దానినీలోకములో ప్రవర్తింపఁజేసెను.] అట్టి రామాయణములో నొక్కొక్క యక్షరమును ఎంతటి మహాపాతకముల నైనను నశింపఁజేయఁ జాలినట్టిది. ఎవఁడు రామాయణమును భక్తితో వినునో శక్తి చాలదేని, అందలి యొక్క శ్లోక పాదమును కాని, కనీసము ఒక్క పదమును గాని వినునో - అట్టివాఁడు బ్రహ్మలోకమున కేగును. సర్వదా బ్రహ్మచేత సమ్మానింపఁబడును. ఈ విధముగా ప్రాచీనులు రామాయణమును కీర్తించిరి. అందువలననే శ్రీమద్రామాయణమునకు "అనుగ్రహ గ్రంథ" మనియు పేరు కలిగినది.

వైష్ణవులు రామాయణమును 'దీర్ఘశరణాగతి' అని పేర్కొనుచు దురు. అనగా శరణాగతుల యొక్క పరంపర అని యర్థము.

"అను కూల్యస్య సంకల్పః
ప్రాతి కూల్యస్య వర్జనం
రక్షిష్యతీతి విశ్వాసః
గోప్తృత్వేవరణం తథా
ఆత్మనిక్షేప కార్పణ్యే
షడ్విధా శరణాగతిః

అను శ్లోకము శరణాగతి ఆరు విధములని తెల్పుచున్నది. అనుకూల్య సంకల్పము, ప్రాతికూల్య వర్జనము, ఇతడు నన్ను తప్పక రక్షించునను విశ్వాసము, ఇతడు రక్షకుడని వర్ణించుట, తన సర్వస్వమును రక్షకుడైన భగవంతుని వశమొనరించుట, దైన్యము అను ఆరును శరణాగతి లక్షణములు.

రావణుని బాధలను పడలేక దేవతలు శ్రీమన్నారాయణుని, శరణు జొచ్చుటతో వాల్మీకి రామాయణము ఆరంభమగుచున్నది. ఇది ప్రథమ శరణాగతి. విశ్వామిత్రుడు కూడ శరణాగతుడే. అహల్య, జటాయువు, శబరులు శరణాగతుల కోటిలోనివారే. సుగ్రీవుడు రాముని శరణు జొచ్చెను. ఈ సందర్భమున అంగద హనుమ శరణాగతులును గోచరించును, రామాయణమున చివరిది విభీషణ శరణాగతి. రావణుని సోదరుఁడయ్యును విభీషణుఁడు రాముని శరణము జొచ్చెను. ఇంతేకాదు దశరథుడు మున్నగు వారందరును శ్రీమన్నారాయణుని అవతారమైన రాముని శరణు చొచ్చినట్లే కన్పట్టును. ఇన్ని శరణాగతు లుండుటచేతనే రామాయణమునకు 'దీర్ఘ శరణాగతి' యను నామము సార్ధకమగు చున్నది.

ఇట్టి రామాయణ మహాకావ్యమును రచించి అవనీ తలమునుండి రసిక లాకాశరంగమున నానందించుటకు సోపానములు నిర్మించిన కవి పుంగవుడు వాల్మీకి మహర్షి. వాల్మీకి వేదాంతులకు వేదాంతి, దార్శనికులకు దార్శనికుడు, కవులకు కవి, ప్రజా మార్గదర్శి. లోకమునకు కవితాభిక్ష పెట్టి ఆదికవి పీఠము నాక్రమించుకొనిన ఆ కవితా తపస్వికివే కైమోడ్పులు.

> "ఆదికవీ చతురాస్యౌ కమలజ వల్మీకజౌ వందే
> లోక శ్లోక విధాత్రోః యయోర్భిదా లేశమాత్రేణ."

కమలజ, వల్మీకజులు ఆదికవులు, ఒకరి ముఖమునుండి వేదము, మఱియొకరి ముఖమునుండి రామాయణమును వెలువడి నవి. ఉభయులును చతురాస్యులు, ఒకరు చతుర్ముఖులు మఱి యొకరు చతురవాక్కులు. ఒకరు లోకవిధాత, మఱియొకరు శ్లోక విధాత. వీరి విధాతృత్వమున లోక శ్లోకములంటు భేదము లేశ మాత్రమే! అట్టి వీరికి నమస్కరింతును - అని అనినాడొక సుకవితా సకృతాత్ముడైన సుకవి యొకడు!

> "జయన్తితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

—కవేవరపు వెంకట్రామయ్య

# భారతి 59వ సంపుటము అకారాది విషయానుక్రమణిక

## 1. వ్యాసములు





# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

| శీర్షిక | | రచయిత | సంచిక సంఖ్య |
|---|---|---|---|
| సైమన్ న్యూ కూంబ్ ఆర్థిక ఆలోచన | | బి. ఆర్. కె. రావు | 12 |
| సోమలదేవి - దాక్షారామ శాసనము | (కల) | సూర్యదేవర రవికుమార్ | 4, 10 |
| | (కల) | తురగా కృష్ణమూర్తి | 7 |
| సౌందర్యం - కళలో, జీవితంలో | | తి | 10 |
| హరిజన సమస్య - ఆంధ్ర కవిత్వం | | మెట్టు మురళీధర్‌రావు | 12 |
| హిరణ్యా హరిణం - ఒక పరిశీలన | (కల) | రెడ్డి | 11 |

## 2. కథలు

| శీర్షిక | రచయిత | సంచిక సంఖ్య |
|---|---|---|
| అన్పించాడు | పాలడుగు వేంకటేశ్వరరావు | 11 |
| ఆవేశ ఫలితం | | 2 |
| ఎన్నిక | కేయస్వీ | 7 |
| పాటు | వి. వి. బి. రామారావు | 3 |
| పాత బాకీ (అను) | బి. వి. రమణ | 1 |
| మృత్యువేళ | పాలడుగు వేంకటేశ్వరరావు | 8 |
| మ్రొక్కుబడి | బెహరా వెంకట సుబ్బారావు | 5 |
| రేగుపండు రుచి | ఆర్. ఎస్. సుదర్శనం | 6 |
| సీటు దొరికింది | రంధి సోమరాజు | 7 |
| సైలెన్స్ | ఇచ్ఛాపురపు రామచంద్రం | 1 |
| వాల్ పోస్టర్లు (రూపకం) (అను) | శ్రీనివాసాచార్యులు; సభాపతి | 2 |

## 3. కవితా రచయితలు

| పేరు | కవిత(లు) ప్రచురించబడిన సంచిక(ల) సంఖ్య | పేరు | కవిత(లు) ప్రచురించబడిన సంచిక(ల) సంఖ్య |
|---|---|---|---|
| అంజయ్య. కె. | 3 | కృష్ణమూర్తి. గన్ను | 4 |
| అప్పలస్వామి. పురిపండా | 11 | కృష్ణారెడ్డి. పులికంటి | 3, 4, 10, 11 |
| అబ్దుల్ ఖాదర్. కలిగిరి. వి. | 12 | కేశవరావు. దేశెట్టి | 11 |
| ఉదయభాను : నరసింహమూర్తి. కోడూరి | 3 | ఖమ్రొద్దీన్ | 2, 9 |
| ఉపాధ్యాయ | 4, 7 | గోదావరి శర్మ. కె. | 1, 12 |
| "కన్న" | 3, 9 | గోపాలకృష్ణ దేశపతి | 12 |
| కాళిదాసు. వజ్ఝల | 3, 9 | చంద్రశేఖర్. కోవుటం | 12 |
| కిశోర్‌బాబు, అశోకుబాబు | 5, 8, 11, 12 | చిదంబరరెడ్డి. సల్లపల్లె | 3 |

| పేరు | కవిత(లు) ప్రచురించబడిన సంచిక(ల) సంఖ్య |
|---|---|
| జగన్నాథం. జూకంటి | 2 |
| జనజ్వాల | 3, 10 |
| జ్యోత్స్న | 10 (అను) |
| తిరునగరి | 3, 6, 12 |
| తిలక్ బి. బి. జి. | 4 (అను) |
| దాశరథి | 1, 4 |
| దినకర్. కె. | 1, 4 |
| దిలావర్ | 4, 7, 11 |
| నరసింహస్వామి. శనగన | 3, 6 |
| నరసింహాచార్యులు. వేముగంటి | 3 |
| నరసింహారావు. వి. వి. యల్. | 1 |
| నారాయణరెడ్డి. సి. | 5, 8, 11 |
| నారాయణరెడ్డి. సుంకిరెడ్డి | 1 |
| నిఖిలేశ్వర్ | 2, 4 |
| పరమేశ్వరరావు. రాపోలు | 11 |
| పార్థసారధి యస్. కె. | 12 |
| పార్థసారధి రెడ్డి. పూలికుంట | 1 |
| పురుషోత్తం. బొడ్డుపల్లి | 3 |
| పూర్ణ | 4 |
| పైడిశ్రీ | 6 |
| ప్రభాకరరావు. ముదివేడు | 12 |
| ప్రియదర్శి | 2 |
| భగ్వాన్ | 4, 12 |
| భానుమూర్తి. ఇంద్రగంటి | 1, 9 |
| భానుమూర్తి. పి. ఆర్. | 4 |
| మందేశ్వరరావు. వడలి | 12 |
| మన్మధరావు. మేకా | 2 |
| మహేంద్ర | 11 |
| మార్కండేయ శర్మ. నాగాభట్ల | 3 |
| రంగారావు. మాదిరాజు | 7, 11 |
| రంగారావు. రావి | 12 |
| రఘునాథం. గుడిహాళం | 1 |
| రమణ. కె. యస్. | 2 |
| రమణారెడ్డి. కె. వి. | 2; 10 |
| రమేష్‌బాబు. గుమ్మనూరు | 1, 4, 9, 12 |
| రవికుమార్. సూర్యదేవర | 6, 7 (అను) |
| రాంమోహనరాజు. కె | 4 |
| రాఘవాచార్య. కందాళై | 3 |
| రాధాకృష్ణ. బండి | 12 |
| రాధాకృష్ణమూర్తి. పాతకోట | 4 |
| రాధాకృష్ణ శర్మ. చల్లా | 5 (అను), 12 |
| రామకృష్ణమూర్తి. కొంపెల్ల | 1, 3, 4, 11 |
| రామసూరి | 12 |
| రెడ్డి. యస్. యస్. | 3, 11 |
| లక్ష్మీపతి. విరియాల | 9 |
| లీలామోహనరావు. కొడవంటి | 4, 8 |
| లీలావతీదేవి. కోడూరి | 9 |
| విశ్వనాథ్. రత్నశేకర | 3 |
| వెంకటేశ్వర్లు. జి. | 4 |
| వేంకటరావు. వసంతరావు | 9 |
| వేంకటశర్మ. మంగిపూడి | 9 |
| వేంకటేశ్వర్లు. బులుసు | 2, 5, 6 |
| శశికాంత్ శాతకర్ణి | 3 |
| శాస్త్రి. పి. యస్. | 3 |
| శివకుమార శర్మ. రామగిరి | 12 |
| శివారెడ్డి. కె. | 9 |
| శేషగిరిరావు. పోచిరాజు | 7, 9 |
| శోభ | 3, 12 |
| శ్రీనివాసాచార్యులు. దీవి | 2 |
| శ్రీరామమూర్తి. గంటి | 7 |
| శ్రీరాములు. గూడ | 1 |
| శ్రీ శ్రీ | 2 |
| సంజీవ్. ఎన్. యస్. | 5, 6, 10 |
| సంపత్‌కుమార్. మేడపరపు | 6 |
| సంపత్కుమారాచార్య. వి | 3 |
| సత్యనారాయణ. భీశెట్టి | 6 |
| సత్యనారాయణ. మానేపల్లి | 6 |
| సత్యవతీదేవి. ఆదూరు | 12 |
| సాంధ్యశ్రీ | 4, 8 |
| సిధారెడ్డి. నందిని | 4, 6, 9 |
| సుజాత. ఇసుకపల్లి | 4 |
| సుదర్శనరాజు. కొండపల్లి | 12 |
| సుధాకరరావు. మేకా | 3 |
| సూర్యప్రకాశ్. ఎం. | 6, 11 |
| సోమరాజు. రంధి | 3, 8 |
| సోమరాజు. వేంపాటి | 3 |
| సోమసుందర్ | 2, 8, 10 |
| హనుమచ్ఛాస్త్రి. జానుమద్ది | 10 (అను) |
| హన్మంత్రావ్. యస్. | 8 |

కల : కలగూరగంప  అను : అనువాద రచన

— డా॥ ఎన్. రవికుమార్

# గ్రంథ విమర్శలు

## శ్రీ లలితా త్రిశతీ భాష్యమ్

[అనువచనము : శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి, ప్రాప్తిస్థానము : సాధన గ్రంథమండలి - తెనాలి, మూల్యము: రూ. 30/-]

'సాధన గ్రంథమండలి' ప్రచురిస్తూన్న శంకర గ్రంథ రత్నావళిలో ఇది ద్వాదశ సంపుటం.

అగస్త్యునకు హయగ్రీవుని ముఖతః పరమేశ్వరి పలికించిన స్తుతి 'లలితా త్రిశతి'.

'సర్వపూర్తికరి' - అని యీ స్తుతికి 'అమ్మ' పెట్టిన పేరు. అది 'లలితా త్రిశతి'గా ప్రసిద్ధమయింది.

'పంచదశి' అక్షరాలను ఆదినుంచి వరుసగా ఇరవై శ్లోకాలకు విభజించి చెప్పగా ఆ తల్లి నామాలు మూడు వందలయాయి. అదే 'త్రిశతీ-స్తుతి' అయింది. కొన్ని అమ్మ చెప్పగా కొన్ని అయ్యగారు - కొన్ని ఇద్దరూ కలిసి చెప్పినవి. ఆ శ్లోకాలను నారాయణావతారమూర్తి అమ్మ అనుమతిని కుంభసంభవునకు ఉపదేశించాడు.

ఆ దివ్య స్తోత్రానికి మానవ వేషధరుడై శంకరుడు భాష్యం పలికాడు. దానిని ఆ భాష తెలియనివారికీ, తెలిసీ తెలియని వారికీ తేటతెల్లముగ తెలుగున చెప్పిన సచ్చిదానందమూర్తి బ్రహ్మశ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు.

లలితా సహస్ర నామస్తోత్రంకన్నా ఇది ఫలప్రదానంలో మిన్న అని 'అమ్మ' మాట. కాబట్టి దీనిని సవినయంగా శ్రద్ధా భక్తులతో పారాయణ చెయ్యడం సత్కృతిగా వచనీయం.

'హాదివిద్యా' - పరమేశ్వరి నామం. దీనికి 'హాదివిద్యా-లోపాముద్రోపాసిత మనురూపా ఇత్యర్థః (శంకర భాష్యం)

దీనికి 'హకారము ఆదియందు గల పంచదశీవిద్య హాదివిద్య. లోపాముద్రచేత ఉపాసింపబడిన హాదివిద్యా మంత్ర స్వరూపము గలది అగుటవలన శ్రీ త్రిపురసుందరి హాదివిద్య అని స్తుతింపబడుచున్నది. ఈ నామమువలన మంత్రమునకు తద్దేవతకు గల అభేదము సూచితము' అని శాస్త్రిగారి వివరణ- ఆదిశంకరుడే తన భాష్యానికి ఈనాడు శాస్త్రిగారి రూపాన తెలుగులో వివరణ ఇచ్చాడని నా భావన.

ఈలాటి దివ్య గ్రంథ సముదాయమును ఆంధ్రులకు అందించడానికి పూనుకున్న శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రి గారిని ప్రత్యేకించి అభినందిస్తున్నాను.

ఒక నామం శ్లోక రూపములో 'కస్తూరీ తిలకోజ్జ్వలా'— అని ఉంది. భాష్యరచనలో....తిలకాంచితా' — అని అచ్చు.... దేనిని పాఠ్యముగా భావించాలో తెలియలేదు.

అక్కడక్కడ అచ్చుతప్పులు ఉన్నాయి. సామాన్య పాఠకునకు సవరణ తెలియకపోవచ్చు.

ఈ గ్రంథం చదివేముందు శాస్త్రిగారూ, బులుసువారూ వ్రాసిన ముందుమాటలు చదివితే గ్రంథస్థ విషయ హృదయం అర్థం అవుతుంది.

## శ్రీ విమర్శా ప్రకాశ వీరేశ్వర సుప్రభాతస్తవః

[రచయిత: శ్రీ పోలారామ సుబ్రహ్మణ్యం, కూచనపూడి, ప్రాప్తిస్థానం, వెల-తెలుపలేదు.]

కూచనపూడిలో ఉన్న శ్రీ విమర్శాప్రకాశ వీరేశ్వరస్వామి దేవాలయం ఇంచుమించు పదారవ శతాబ్దంలో రూపొందినట్టు రచయిత 'ప్రవేశిక' - వల్ల తెలుస్తుంది. ఆ దేవాలయ ప్రధాన ధర్మకర్తలు పులిగడ్డవారు.

వీరేశ్వరుడు ఈ కృతిలో శివుడుగానే దర్శనమిస్తాడు. 'వీరేశ్వరేశ్వర విభో! తవ సుప్రభాతమ్' - అనే మకుటముతో

నలభై నాలుగు శ్లోకాలూ, మంగళాశంసనముగా పన్నెండు శ్లోకాలూ, చివర రచయితకి సంబంధించిన రెండు శ్లోకాలూ ఉన్న స్తవం ఇది. స్తోత్రం, ప్రపత్తి - అనే శీర్షికలు లేవు.

'శ్రీ గంధ పర్వత సమీకృత శీతగంధం
గంధార్చ నార్థముపవాహ్య స గంధవాహః
శ్రీ గంధయత్యఖిల భక్తసమాజ మార్యం
వీరేశ్వరేశ్వర! విభో! తవ సుప్రభాతమ్'—

సరసమైన పద ప్రయోగం-సరళమైన శైలి-తెలుగు తాత్పర్యం ఇంకా సొంపుగా ఉంది.

34వ శ్లోకములో 'కేకీరవం' - అనేది మార్చాలి.

మంగళాశంసనంలో 'గిరిజోత్సంగ సంగాయ' - అని సవరిస్తే అర్థం సులభంగా తెలుస్తుంది. గణభంగ దోషం పోతుంది. అలాగే తరువాతి శ్లోకములో 'హిమశృంగ సంగళం గాయ' - అనేది సవరించాలి.

'శ్రీ చక్రాంకిత మూర్ధాయ' - అనే సమస్తపదం - సమాసాంతమందు మూర్ధన్ శబ్దం అకారాంత మౌతుందా?

ఏది ఎలా ఉన్నా - స్తోత్రం, ప్రపత్తి - శీర్షికలతో సహ ఉంటే సాంప్రదాయ పాలనం జరిగినట్టు ఉండేది.

## శ్రీ వెలుగొండ స్వామి చరిత్ర

[రచన : విద్వాన్ కొమాండూరి రామానుజాచార్యులు, ప్రతులకు: రచయిత పేర- ఉలవపాడు- ప్రకాశం జిల్లా-523 292 అని వ్రాసేది. వెల: రు. 10-00]

ఇది ద్వితీయ ముద్రణ. ఈ ముద్రణకి శ్రీ శివలెంక రాధాకృష్ణ మహాశయులు (ఆంధ్రపత్రిక) చేసిన ఆర్థిక సాహాయ్యం ప్రథమ గణ్యం.

క్షేత్రాలకు ఆనాళ్లలో ఉన్న మర్యాద యీనాడు ఉన్నట్టు గట్టిగా చెప్పలేను. గద్దెపైనున్న పెద్దలు కూడా అంత పట్టించుకున్నట్టు కన్పట్టదు. రాబడి కళ్లనిండుగా ఉన్న ఏ తిరుపతివంటి క్షేత్రానికో అది జరుగుతూందిగాని యీ వెలుగొండలాటి క్షేత్రాలకు ఆ యోగం దొరకనందువల్ల పట్టినట్టు కన్పట్టదు. ఆ ప్రాంతంలో ఉన్న ఉదార హృదయుల సేవలు మాత్రం కొంత వరకు అక్కడ పట్టిన చెదలనూ పొదలనూ వదిలిస్తున్నట్టు వినుకలి. ఆ విషయం ఈ గ్రంథం చదివితే తెలుస్తుంది.

ఆచార్యులుగారు శాసన పురాణ ప్రమాణాలతో యీ క్షేత్ర చరిత్ర వ్రాశారు. ఇక్కడ ఉన్న దేవుడు కూడా

తిరువేంగళనాథుడే - తలనీలాలు సమర్పించడం లాంటివి ఇక్కడ కూడా జరుగుతూ ఉంటాయంటే మరి ఆ వేంకటేశ్వరుడే యిక్కడ ఉండి భక్తులను ఆదుకుంటున్నాడని భావించి సంభావించాలి.

ప్రథమ ముద్రణ గ్రంథానికి నేను సమీక్ష వ్రాయడం-అది 1985 ఏప్రిల్ భారతిలో వెలువడడం అయింది. కాబట్టి యీ కృతికి పునః విశేషించి వ్రాయనక్కరలేదని ఇలా పరిచయం వాక్యాలు నాలుగు వ్రాసి విడుస్తున్నాను.

## ఉపనిషచ్చింతన

[రచన : శ్రీ ఏటుకూరు బలరామమూర్తి, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞానభవన్ 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు 500 001 వెల: రూ. 10/-]

విశాలాంధ్ర బుక్ హౌస్ విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి మొదలైన శాఖల్లో కూడా లభ్యం అవుతుంది.

ఇదొక వింత విమర్శ రచన.

పేరు 'ఉపనిషచ్చింతన' - గ్రంథస్థ విషయం వివిధ మత చర్చ - ద్వైతాద్వైత సాంఖ్య, వైశేషిక, న్యాయ, బౌద్ధ, జైనముల పద్ధతులను పేర్కొని పరస్పర విరుద్ధ విషయాలను పేర్కొంటూ రచన సాగించడం కనిపిస్తుంది.

ఆత్మ, పరమాత్మ, ప్రకృతి, పురుషచర్చ - దేహ, జీవ సంబంధాలనూ వెల్లడిస్తూ ఒక దారికి తేవడం సాధ్యం కాని విషయం. కర్మకాండ ప్రాముఖ్యమూ వైముఖ్యమూ రెండూ ఈ చర్చలో చోటు చేసుకున్నాయి.

అలాటిరీతిన పాంచభౌతిక విమర్శ గోచరిస్తుంది. అన్య చింతన లేక తాత్త్విక విషయ గ్రహణం ప్రధానంగా చదవవలసే రచన యిది. మొత్తంమీద ఇదమిత్థం అని తేల్చిచెప్పడం జరగలేదనే నాకు అర్థం అయింది.

—యామిజాల పద్మనాభస్వామి

Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press. Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247